## దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

### [illegible] మరియు అమృతోత్సవము



చీఫ్ జస్టిస్ శ్రీ ప్రభా శంకర్ మిశ్రా గారికి శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు మొమెంటో అందిస్తున్న చిత్రం.



డా॥ అక్కినేని నాగేశ్వరరావు గారికి శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు మొమెంటో అందిస్తున్న చిత్రం.

508

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

అక్టోబరు 1996

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చందా రూ. 40-00

విడి ప్రతి రూ. 4-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

---

# ఈ సంచికలో.....

సంపాదకీయం

# గాంధి జయంతి

అక్టోబరు 2వ తేదీ గాంధి జయంతి దినం. ఆనాడు భారతదేశమందంతటా ఎంతో ఉత్సాహంతో, ఉల్లాసంగా గాంధిజయంతి ఉత్సవం జరపబడింది. గాంధీజీ జాతిపిత. భారతదేశానికి స్వాతంత్ర్యం సముపార్జించిపెట్టిన మహానాయకుడు. నిద్రాణమైన భారతజాతికి నూతన స్ఫూర్తిని, స్థైర్యాన్ని ప్రసాదించిపెట్టిన మహామనీషి-యోద్ధ, పీడిత మానవజాతి సముద్ధరణ ఆయన ఆదర్శం. అందుకు ఆయన ఒక కార్యక్రమాన్ని ఏర్పర్చారు. జీవితంలో ఆడంబరాలకు తావు వుండగూడదన్నారు. స్వావలంబనం మన మార్గమన్నారు. శరీర పరిశ్రమకు పెద్ద స్థానాన్ని కల్పించారు. దీన మానవ సేవ మన కర్తవ్యమన్నారు. నిర్మాణ కార్యక్రమానికి రూపకల్పన చేశారు. భారత జాతినంతనూ ఆమార్గంలో నడిపించారు. అహింసకు ప్రధాన స్థానాన్ని కల్పించారు. మనమనుసరించవలసిన ఆర్థిక విధానాల విషయంలో గూడా ఆయనగారి కొక నిశ్చిత విధానమున్నది. ఆ విధానం మన దేశ పరిస్థితికి అనుగుణంగా వుండవలెనని వారి అభిప్రాయం. భారతదేశం గ్రామ నాగరికత కలిగిన దేశం. మన దేశంలో గ్రామాల సంఖ్య ఎక్కువ. గ్రామాలలో నివసించే వారి అభివృద్ధికి ఆర్థిక విధానం తోడ్పడాలి. అందుకు అనువైన సాధనాలనే మనం ఉపయోగించాలి. మానవ శక్తికి, చేతిపనులకు ప్రాధాన్యం ఏర్పడాలి. యంత్రాలు మానవునికి సహాయం చేసేవిగా వుండాలి. అవి శోషణకు సాధనాలు కాకూడదు. గ్రామాలలోని సహజ వృత్తులకు అవి ప్రోత్సాహం కలిగించాలి. వాటి విధ్వంసనానికి తోడ్పడగూడదు. ఇది వారి ప్రధాన లక్ష్యం. స్వాతంత్ర్యం లభించిన తరువాత ఆ లక్ష్యం కొంతవరకు విస్మరించబడింది. జీవితంలో నీతికి ప్రాధాన్యం తగ్గింది. అధికార వ్యామోహం, ధనకాంక్ష పెచ్చు పెరిగింది. అధికారం రాను రాను ఒక వృత్తిగా మారుతున్నది. దానివలన కలిగే దుష్ఫలితాలను మనం ఈనాడు చూస్తున్నాము. దేశమంతా అల్లకల్లోల పరిస్థితికి చేరుకొంటున్నది. పార్టీల సంఖ్య పెరుగుతున్నది. పరస్పర విశ్వాసం తగ్గిపోతున్నది. ఒక పార్టీవారు ఇంకొక పార్టీ వారిని ఎలా మన్ను కరిపించాలి అనే ఆలోచన పెచ్చు పెరిగిపోతున్నది. ఇది గాంధిగారు ఆశించిన దానికి పూర్తిగా వ్యతిరేకమని చెప్పక తప్పదు. దీనివలన జాతికి కీడు ప్రాప్తిస్తుందేగాని మేలుగాదని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఆ

వాతావరణంలో గాంధి జయంతిని జరుపుకొన్నాము. మొదటి ఆ ఉత్సాహం లేదు. ఆ శ్రద్ధగూడా కనిపించడం లేదు. నాయకుల చిలుక పలుకులకు కొదవలేదు. ఖాదీ వంటి వాటికి ఆదరణ తగ్గిపోతున్నది. నిర్మాణ కార్యక్రమాంశాలు గూడా గాంధిగారు ఆశించిన రూపంలో, అమలుగావడం లేదు. మొక్కుబడి చెల్లింపులు జరుగుతున్నవి. ఇది ఈనాటి పరిస్థితి. గాంధిగారి ఆశయాలనేగాదు గాంధిగారిని గూడా యువతరం వారు, మరచిపోతున్నారు. భావితరం విషయం చెప్పనక్కర్లేదు అంతగా వాతావరణం మారుతున్నది. దీని మార్పుకు తగిన శ్రద్ధ వహించడం అవసరం. గాంధిగారు బోధించిన మార్గాన్ని విడనాడి, వేరు మార్గాన్ని అవలంబించి జాతి పునరుద్ధరణకు, దేశ సౌభాగ్యానికి తోడ్పడగలిగితే కొంత సంతోషించవచ్చును. అది ఎక్కడా కనబడడం లేదు. జాతి స్వాతంత్ర్యానికి తోడ్పడిన స్వతంత్ర సేనానులలో గూడా ఉపేక్షాభావం, ఏదో అశక్తత కన్పిస్తున్నది గాంధిగారు స్థాపించిన నిర్మాణ కార్యక్రమసంస్థలు గూడా మొదటి స్వావలంబనాన్ని వదలి ప్రభుత్వంవైపుకు ఎదురు చూడవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. అది రోజు రోజుకూ పెరుగుతున్నది. అది జాతికి మంచిదిగాదు. అది నిస్సహాయ స్థితికి దారితీస్తుంది. ఆలోచనా విధానమే మారిపోతున్నట్లు కన్పడుతున్నది. గాంధి జయంతి సందర్భంలోనైనా మానవతా విలువలకు గాంధీజీ కల్పించిన ఉత్తమ స్థానాన్ని గుర్తించుకొని ఆయన అభిలషించిన రామ రాజ్య మార్గంలో పయనించడం సాధనాలకు గల పవిత్రతను గుర్తించి వ్యవహరించడం మన విధ్యుక్త ధర్మం. తిరిగి గాంధీజీ ఉపదేశించిన మార్గాన్ని జాతి అనుసరించగలదనీ, అందుకు అనువైన కార్యక్రమాన్ని రూపొందించగలదనీ ఆశిస్తున్నాము.

సాహిత్యవీథి

# తెలుగు కవులు - కవిత్వ నిర్వచనం

- సి. హెచ్. లక్ష్మణ చక్రవర్తి

అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే. ఆనందవర్ధనుడు

సాహిత్యంలో మార్పుకు కారణాలు రెండు. 1. కాలం 2. కవి.

సాహిత్యంలో నిత్య నూతనమైన భావాలు వెలుస్తున్న కొద్దీ కాల ప్రభావం చేత కావ్యము యొక్క లక్షణము వివిధ రూపాలుగా మారుతుంటుంది. అపారమైన కావ్య సంసారంలో బ్రహ్మ లాంటి కవి వలన అతని భావాల వలన కావ్యము యొక్క లక్షణము మారుతుంటుంది. 'మహర్షీణాం మతయశ్చ భిన్నాః' అనుట చేత వారి అభిప్రాయములు వేరువేరుగా ఉండుననుట నిశ్చయము.

ఈ మార్పుల వలన కావ్య కవిత్వ లక్షణ విషయాలలో కూడా అనేక వాదోపవాదములు ఉన్నట్లు మనకు కావ్యలక్షణ గ్రంథాల ద్వారా తెలియుచున్నది. సంస్కృత లాక్షణికులు, పాశ్చాత్య విమర్శకులు కావ్య కవిత్వ లక్షణాలను గూర్చి అనేక గ్రంథాలు రచించినారు కానీ తెలుగు భాషా సాహిత్యాలు సంస్కృతంపై ఆధారపడటం వలన తానుగా ఎక్కువ లక్షణ గ్రంథాలను వెలువరించి తనవి చేసుకోలేకపోయింది. తెలుగు భాషకు ఉన్న లక్షణ గ్రంథాలు చాలా తక్కువ. అయినా సంస్కృతంలో వచ్చిన అనేక లక్షణ గ్రంథాలు మన తెలుగు లాక్షణికులు లేదా కవులు అనువాదం చేయడం వలన తెలుగు భాషకు లక్షణ గ్రంథాలు లేని లోటు తీరినది. ఈ లక్షణ గ్రంథాలలో ఇంచుమించుగా సంస్కృత లాక్షణికుల అభిప్రాయాలనే పొందుపరిచి వివరించడం జరిగింది. సంస్కృతభాష మనపై ఎంత ప్రభావం చూపిందంటే తెలుగు కవులు కూడా సంస్కృతంలో లక్షణ గ్రంథాలు రచించడం వరకు వెళ్ళినది. ఉదాః- జగన్నాథ పండితరాయల రసగంగాధరము, పెదకోమటి వేమారెడ్డి సాహిత్యచింతామణి మున్నగునవి. తెలుగులో కూడా కొన్ని లక్షణ గ్రంథాలు ఉన్నాయి. అవి పూర్తిగా సంస్కృత భాషా సాహిత్యాల వలన వచ్చినవే. అయితే మన తెలుగు భాషా సాహిత్యాలకు చెందిన కవులెవరూ కవిత్వాన్ని గూర్చి కావ్యాన్ని గూర్చి నిర్వచనం ఇవ్వలేదా? అనే ప్రశ్న ఉదయిస్తే మన తెలుగు కవుల కావ్యావతారికలు, సంకలనగ్రంథాలు, సాహిత్య చరిత్ర గ్రంథాలు వాటికి జవాబు చెప్పడానికి సిద్ధంగా ఉన్నాయి. అలా కవిత్వాన్ని గూర్చి చెప్పిన కొందరు కవులను చెప్పటమే ఈ వ్యాస ఉద్దేశ్యము. ఈ వ్యాసంలో నేను కావ్యాలలో కవితా ఖండికలలో కవిత్వాన్ని గూర్చి చెప్పిన కొందరిని మాత్రమే గ్రహించినాను.

తెలుగు సాహిత్యానికి ఆదికవి నన్నయ్య. భారతమును తాను జగద్ధితం కొరకు రచిస్తానన్నాడు. అంటే అతని అభిప్రాయంలో 'సహితస్య భావం సాహిత్యం' అని. ఆంధ్రశబ్దచింతామణి నన్నయ్య వ్రాశాడని అంగీకరించగలిగితే అందులో మనకు 'విశ్వశ్రేయః కావ్యమ్' అనే వాక్యం కన్పిస్తుంది. విశ్వము యొక్క శ్రేయస్సును కోరేదే కావ్యము లేదా కవిత్వము. అని నన్నయ్య భావన. సమాజము సాహిత్యము పరాస్పరాశ్రయములు. కవులు

C/o సంపత్కుమారాచార్యులు, బిర్లామందిర్, సైఫాబాద్, హైదరాబాద్ - 4.,

సమాజంలోని వారే కనుక దేశ కాల పరిస్థితులకు వశ్యమగుట సహజము. అలాగే ఈ యుగ ప్రభావంచేత రచనచేయవలసి వచ్చిన నన్నయ్య జగత్తు యొక్క హితమును కోరుతూ రచన చేశాడు. అందుకే కావ్యము ప్రపంచానికి శ్రేయస్సును కల్గించాలని అన్నాడు.

కవిత్వం మత ప్రచారానికే పనికి వస్తుంది అని భావించి రచనలు చేసిన వారు శివకవులు. వీరు కవిత్వాన్ని తమ శైవ మత ప్రచారానికి ఉపయోగించారు. వీరి కవిత్వంలో నిబద్ధత (కమిట్‌మెంట్) ప్రధాన లక్షణము. 'కవనము సవనము కొరకే' అన్నంతగా కవిత్వాన్ని మత ప్రచారానికి ఉపయోగించుకున్నారు. కవిత్వాన్ని తాము ఎంతగా మత ప్రచారానికి ఉపయోగించుకున్నా కావ్య కవిత్వ లక్షణాలను మొదటగా వివరించినది శివకవులే అనడంలో సందేహం లేదు.

నన్నెచోడుడు తన కుమార సంభవంలో కావ్యమును మదగజంతోను, వరసతితోను పోల్చినాడు. కవిత్వాశయాల్ని చక్కగా వివరించినాడు.

సీః- మృదురీతి సూక్తులింపొదవింప మేదిల్లు
భావము నెలమి వుత్యావహముగ
మెఱుగుల గన్నులు మిఱుమిట్లు వోవఁగ
గాంతి సుధాసూతి కాంతి జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశి మార్గంబులు దేశియములుగా న
లంకారములు దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనముల నిధులు నిలుప
వలవదే సమస్త వస్తు కవీశ్వర
రచిత రుచిర కావ్య రత్న వీధి కుమార సంభవం 1-36

నన్నయాదులు మార్గ పద్ధతిలో రచన చేసినారు. దేశీ ప్రీతి వలన దేశి రచనలను ప్రోత్సహింపదలచి దేశీ మార్గ పద్ధతులలో దేశి పద్ధతిలో రచన చేయాలన్నాడు. "తలయూపింపనియది కావ్యమే" అని ప్రశ్నిస్తూ రచనలోని చమత్కృతి వలన సహృదయుడు ఆనందాతిశయంతో తలను ఊపే విధంగా కవిత్వం ఉండాలన్నాడు. కావ్యంలో నవరసాలు, అష్టాదశ వర్ణనలు, 36 అలంకారాలు, రసము, గుణము, రీతి, కావ్యానికి ముఖ్యము అని కావ్య లక్షణాలను చెప్పినాడు. ఇంత విస్తృతంగా కావ్య లక్షణాలను కవిత్వ ఆశయాల్ని నన్నెచోడుడు చెప్పినా సంస్కృత లాక్షణికులతో బాటు కొందరు తెలుగు లాక్షణికులు అంగీకరించిన 'ధ్వని' ని గూర్చి చెప్పకపోవటము కొంత లోటుగా కన్పించుచున్నది. ఇతను చెప్పిన అక్షరాలు, సూక్తులు. చతురోక్తులు, వర్ణనలు, రసములు, 64 విద్యలు, అలంకారాలు, అన్నీ కావ్య బాహ్య సౌందర్య హేతువులే.

తెలుగు సాహిత్యంలో మొదట విప్లవ కవిగా పేరుగాంచిన పాల్కురికి సోమనాథుడు కవిత్వాన్ని గూర్చి విపులంగా చెప్పకపోయినా చెప్పిన మాటలలో ఎంతో అర్థం ఉంది. ఇతని దృష్టిలో కవిత్వము

'అల్పాక్షరముల అనల్పార్థ రచన
కల్పించుటయె గాదె కవి వివేకంబు.

అలతి పదాలతో విశేషమైన అర్థాన్ని కల్పించడం అనేది కవి వివేకము. పైన చెప్పిన విశేషమైన అర్థం గొప్పదైన ఒక పరమార్థాన్ని సూచించాలి అనేదే సోమన అభిప్రాయము. తాను కవిత్వం వ్రాస్తూ శివ భక్తురాలిని స్తుతించినా అందులో అంతరార్థంగా కన్పించేది శివాద్వైతమే. కవిత్వం ఈ విధంగా ఉండాలని చెప్పి చేసి చూపించినవాడు సోమన. అకాశదారులంట వెళుతున్న సాహిత్యాన్ని ప్రజలముందుకు తెచ్చిన వారు శివకవులు. దేశి వస్తువుతో, ఛందముతో, వర్ణనలతో

రచనలుచేసిన శివకవులు కవిత్వ లక్షణాలను చెప్పిన వారిలో విశిష్టులు. తాము ద్విపద ద్వారా ఇహపర సాధనను పొందుతామని సగర్వంగా చెప్పుకున్నారు.

నాటకీయ శిల్పానికి పేరుగాంచిన నానా రసాభ్యుదయోల్లాసి తిక్కన. పురాణానికి కావ్యగౌరవాన్ని కల్పించిన వాడు. ఇతను తన నిర్వచనోత్తర రామాయణంలో కవిత్వము గూర్చి చెబుతూ

కం. తెలుగు కవిత్వం చెప్పం
దలచిన కవి యర్థమునకు దగియుండెడు మా
టలుగొని వళులు ప్రాసం
బులు నిలుపక యొగిని బులిమి పుచ్చుట చదురే?

యతి ప్రాసస్థానాలను, అర్థవంతమైన పదాలను వాడాలని అలా చేయకుండా ఉంటే కవిత్వం గంభీరంగా ఉండదని చెప్పి తన తర్వాతి కవులకు కావ్య రచనా విధానాన్ని తెల్పినాడు.

తిక్కన సమకాలికుడైన ఆంధ్రభోజుడు అనేకవి కవిని గూర్చి కవిత్వాన్నిగూర్చి చక్కని అభిప్రాయములను చెప్పినాడు. శ్రీరాముడంతటి వాని చరిత్ర ఒక కవి వల్లనే తెలిసింది కదా! అలా ఆ కవి అతని గురించి చెప్పకపోతే అసలు శ్రీరాముడు ఎంత మందికి తెలిసేవాడు. అని కవి ప్రశస్తిని చెప్పి

ఉ:సుందర సర్వలక్షణ విశుద్ధ కవిత్వము గన్నచో రస
స్యంది నిజ స్వభావుడనజాలినయట్ల నిజస్వభావుడా
నందము బొందునట్లు కుజన ప్రకరంబు లెరుంగ నేర్చునే
చందురు జూచి మోదమున సాగర ముబ్బిన నూతు లుబ్బునే?

మంచి కవిత్వాన్ని వింటే మంచివాళ్ళే పొంగిపోతారు. కానీ దానిని ఆస్వాదించలేనివారు పొంగుతారా? చంద్రుణ్ని చూసి సముద్రం పొంగుతుంది కానీ నూతులు పొంగుతాయా? అని ప్రశ్నిస్తాడు. కవిత్వం సహృదయుని హృదయాన్ని ఉప్పొంగింపజేస్తుంది. అలా ఉండేదే మంచి కవిత్వమని ఇతని అభిప్రాయం.

ఈ యుగానికి ఆంధ్రభోజుడు చెప్పిన అభిప్రాయం చక్కగా సరిపోవుచున్నది. ఎందుకంటే తిక్కన ఈ యుగంలో హరిహరాద్వైత ప్రతిపాదన చేసి కావ్యాన్ని అతనికి అంకితం ఇచ్చాడు కదా! మంచివాడు అనగా ఇక్కడ సహృదయుడు. తిక్కన చేసిన సత్కార్యాన్ని గౌరవించి అతని అడుగు జాడలలో నడుస్తాడు అలా కాని వారు ఎదిరిస్తారు. వారు ఎదిరించినందు వలన అది సత్కావ్యము కాకుండా పోతుందా? ఇతని దృష్టిలో మంచి కవిత్వం మంచి హృదయము మాత్రమే స్వీకరించగలదు. ఇది ముమ్మాటికి నిజము.

కావ్యాన్ని మదగజంతో నన్నెచోడుడు పోలిస్తే కవిని ఎర్రన భద్రగజంతో పోలుస్తాడు. ఈ యుగంలో చారిత్రక విశేషములు అంతగా లేవనే చెప్పాలి. హరిహరాద్వైతాన్ని సమర్థిస్తూ సోమన తన కావ్యాన్ని అతనికే అంకితం ఇచ్చాడు. ఎర్రన, నాచన సోమనలు కవిత్వాన్ని గూర్చి గొప్పవైన అభిప్రాయాలను వెలువరించినట్టు కనపడదు.

శ్రీనాథుని యుగానికి తెలుగు సాహిత్య చరిత్రలో విశిష్ట స్థానమున్నది ఈ యుగంలో అనేక కావ్యాలు వచ్చినవి. అలాగే చక్కని కథా కావ్యాలు కూడా వచ్చినవి. తిక్కన స్ఫూర్తితో ఎర్రన సోమనల వర్ణనల వలన ఈ యుగంలో అనేక పురాణాలు కావ్యత్వాన్ని సంతరించుకున్నాయి. శ్రీనాథుడు శృంగారి అని విమర్శక లోకం అభిప్రాయం. అతడు ఔచితీ వంతమైన శృంగారాన్ని మాత్రమే రచిస్తాడు అనేందుకు అతడు కవిత్వాన్ని గూర్చి చెప్పిన పద్యమే చక్కని ఉదాహరణ.

శా: జాతాజాత చరాచర ప్రతతికిన్ సంభూతక స్థానమై
ఖ్యాతంబై బుధ హృద్య మంగళ కవీంద్రాచార్య సంసేవ్యమై

యాతారార్క సుధాంశువై కమల జాతా కల్పమై యెప్పుడున్

జ్యోతిశ్చక్రముబోలె గ్రాల వలదా సొంపారి కావ్యం బిలన్. శివరాత్రి మహత్యం 1-17.

జాతా జాతములు చరాచరములు అగువానికి జన్మస్థానమై ప్రసిద్ధములైన బుధుడు, గురుడు, శుక్రుడు, కుజుడు అను గ్రహాలచే సేవింపదగినదై బ్రహ్మకల్పంగా ఉన్న జ్యోతిశ్చక్రమువలె కావ్యము కూడా జాతా జాత చరాచరములకు స్థానమై ప్రసిద్ధమై పండితులచేతను కవిశ్రేష్ఠుల చేతను ఆచార్యులచేతను సేవింపదగినదై భూమి యందు కావ్యము ఉండాలని అంటాడు. జ్యోతిష్యశాస్త్రానికి కావ్యానికి సంబంధము కల్పించి చెప్పిన చక్కని శ్లేష. ఆ చంద్రార్కం ఉండేకవిత్వమట.కావ్యమట. శ్రీనాధుని కావ్యాలు చాలా వరకు శృంగార రసప్రధానాలు. ఆవిధంగా చూస్తే కవిత్వాన్ని కాంతతో పోల్చి చెప్పాలి. అలా చెప్పకుండా ఉండడంలో అతని ఔచిత్య దృష్టి తెలియుచున్నది. ఇదేగాక ముమ్మకవి అనునతడు కవిత్వం గూర్చి అడిగితే తన కవిత్వం ఇలా ఉంటుందని చెప్పిన పద్యము పూర్తి శృంగార దృష్టితో చెప్పినట్లు కనబడుతుంది. ఈ యుగం వాడే అయిన అనంతుడు మమ్మటుడు కావ్య ప్రకాశంలో చెప్పిన

కావ్యం యశసే ర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే

సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మిత తయోవుప దేశయుజే

అన్న శ్లోకాన్ని తన సాహిత్య శాస్త్రంలో అనువదించక పోయినా తన మొదటి కావ్యమైన 'భోజరాజీయం'లో అనువదించాడు. కాంతా సమ్మితంగా కావ్యాన్ని వ్రాసేవారు అరుదయ్యారని ఆడ, మగ, కలిసి చదువుతున్నప్పుడు సిగ్గుపడనిదే అసలైన కాంతా సమ్మితమైన కావ్యం అని చెప్పినాడు. తాను కావ్యాన్ని కాంతా సమ్మితంగానే రచించినాడు.

సాహిత్య చరిత్రకు స్వర్ణయుగం ప్రబంధయుగం, ఆంధ్రుల చరిత్రకు స్వర్గయుగం, రాయల యుగం భువన విజయ సభలో అష్టదిగ్గజములుగా పేరుగాంచిన కవి వరేణ్యులను పోషిస్తూ భోగలాలస జీవితాన్ని అనుభవిస్తున్న ప్రజలను పాలిస్తూ చీకూ చింతా లేకుండా రాజ్య భారం నిర్వహించినవాడు శ్రీకృష్ణదేవరాయలు. ఈ యుగ కావ్యాలలో శృంగారం ప్రధాన రసం. అలాగే ఈ యుగంలో కవిత్వలక్షణాలు, కవిత్వ ఆశయాలు కూడా శృంగార రసాన్ని దృష్టిలో ఉంచుకుని చెప్పినట్టు కనబడుచున్నది.

ఈ యుగంలో కవిత్వం గూర్చి చెప్పే పద్ధతిలో నూతనత్వం కనిపిస్తుంది. 'రామాభ్యుదయ' కర్త అయ్యలరాజు రామభక్తుడు వర్షర్తువు యొక్క వర్ణన చేస్తూ కవిత్వ లక్షణాలను వివరించడం ఒక ప్రత్యేకత.

ధారాశుద్ధి ప్రసిద్ధిగాంచి ఘనశబ్ద స్ఫూర్తి వర్తిల్లగా

తోరంబైన రసస్థితిన్ తరళ విద్యున్మాలికా లక్షణో

దారంబై కవి సేవ్యమై వనమయూరా రూఢి బ్రాపించి వ

ర్షారంభంబు ప్రబంధ మ ట్లఖిల పద్యాక్రాంత మయ్యెంగడున్

ఇదేగాక సంతానం లేదని విచారించే దశరథుడు ధ్వనిచాలని కావ్యం లాగా ఉన్నాడని అంటాడు. ఇతను కావ్యావతారికలో కవిత్వ లక్షణాలు చెప్పకుండా తనకు ఇష్టము వచ్చినచోట్ల ఔచిత్యమునకు భంగము కలుగకుండా కవిత్వ లక్షణాలను వివరించినాడు. ఇదే యుగంలోని మాదయగారి మల్లన కూడా రసము చిప్పిల్లేటట్లు కవిత్వం చెప్పాలి. అలాగని అస్తమానం కవిత్వం చెప్పాలని ఆలోచిస్తూ కూర్చోకూడదని భావావేశం వచ్చినప్పుడే వ్రాయాలని అప్పుడే మంచి కవిత్వం వస్తుందని చెప్పాడు. భావావేశమును నిర్ణీత అక్షరాల ద్వారా ప్రదర్శించడమే కవిత్వం అన్న ఇతని మాటలు "The

expression of imagination" అన్న మాటలకు మాతృకగా యున్నవి.

ఇదే గాక అల్లసాని వారి

పూతమెఱుంగులుం బసరు పూపబెడంగులు జూపునట్టి వా
కైతలు? జగ్గు నిగ్గు నెన గావలె గమ్మన గమ్మన న్వలెన్
రాతిరియున్ బవల్ మరపురాని హొయల్ చెలి యారజంపుని
ద్ధాతరి తీపులో యనగ దారసిల న్వరే లో దలంచినన్
బా ‹తిగ బైకొనన్ వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసు కోర్కులు రావలె నాలకించినన్
జేతి కొలంది గౌగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే
ల్మూతల చన్నుదోయి వలె ముచ్చటగావలె బట్టి చూచినన్
డా తోడ నున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మ
నౌ
వాతెఱ దొండపండువలె వాచవి గావలె-బంట నూదినన్
గాతల దమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బెపు
న్మే తెలియబ్బురంపుజిగి నిబ్బర పుబ్బగు గబ్బి గుబ్బ పొం
బూతల నూనె కాయ సరి పోడిమి కిన్నర మేలుబంతి సం
గాతపు సన్న తంతి బయకారపు గన్నడ గౌళ పంతుకా
సాతత తానతానల పసన్ దివుటాడెడు గోటమీటుబల్
మ్రోతల నుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చ తెన్గులీ
రీతిగ,

పై ఉత్పలమాలిక కావ్యము కాంతాసమ్మతం అనే విషయాన్ని స్పష్టం చేయుచున్నది. కన్యతో కావ్యాన్ని పోలుస్తూ ఈ ఉత్పలమాలికలో కవిత్వం అంటే ఎలా ఉండాలో ఏ భాషలో ఏ రీతిగా ఉండాలో వివరించినాడు.

ఔచిత్యపాలన చేయకుండా రచనలు చేయడం, శృంగారం మితి మీరడం, వర్ణనలలో క్రొత్తదనం లేకపోవడం వలన శబ్దగారడీలు చేయడం వలన ఈ యుగాన్ని క్షీణ ప్రబంధ యుగంగా చరిత్రకారులు పేర్కొన్నారు. ఈ యుగంలో ప్రతి పద్యంలోను చమత్కారం ద్యోతకం అయ్యేవిధంగా రచించాలని చెప్పిన ఒక్క చేమకూర వేంకటకవి రచించిన విజయవిలాసం తప్ప మిగతా ప్రబంధాలు ఏవీ గొప్ప ప్రబంధాలుగా పేరు పొందలేదు. ఈ యుగ నాయకరాజు అయిన రఘునాథ నాయకుడు కృష్ణదేవరాయలవలె కవి రాజు కూడా. అతను కవిత్వాన్ని గూర్చి చెబుతూ "విప్పిన విరిపొట్లము వలె గుప్పుమనవలె" అని అన్నాడు. పువ్వుల గుభాళింపు పొట్లంవిప్పితే ఎలా వస్తుందో కవిత్వం ఎత్తుకుంటే అలా ఉండాలన్నది ఇతని అభిప్రాయం. ఇదేగాక

కం. పలుకగవలెనవరసములు
కులుకంగం బద్యములు చెవులకున్ హృద్యముగా
నళుకక యటుగా కున్నం
పలుకక యుండుటయె మేలు బహుమానముగన్

నవరసాలు ఉండేటట్టు చెప్పగలిగి చెవులకు ఇంపుగా హృదయాన్ని హత్తుకునే విధంగా కవిత్వం చెప్పగలిగితే చెప్పాలి లేదా కవిత్వం చెప్పకుండా ఉండటమే పెద్ద బహుమానమంటాడు.

పైన తెల్పిన వారేగాక చరిగొండ ధర్మన్న (కవిత్వాన్ని గుర్రంతో పోలుస్తూ) మొల్ల (సామెతలు వాడుతూ చదవగానే అర్థం స్ఫురించే విధంగా రచన చేయాలని) ఇలా చాలామంది కవులు కవిత్వాన్ని గూర్చి తమ అభిప్రాయాన్ని తెలిపినారు.

ఆధునిక యుగంలో పాశ్చాత్యభాషా సాహిత్యాల ప్రభావంచేత అనేక సాహిత్య ప్రక్రియలు తెలుగుభాషలోనికి చొచ్చుకొని వచ్చినవి. క్షీణయుగ ప్రబంధాలపై విమర్శను చేస్తూ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ సరస్వతీ నారదవిలాపంలో "ఛందోబద్ధంబగు పద బృందాటోపంబు తా కవిత్వంబగునే?" అని ప్రశ్నించి శబ్దార్థాలకు రెండింటికి

ప్రాధాన్యం ఇవ్వాలన్న తిక్కన మాటలను గుర్తుచేశారు.

తిలక్ తన 'అమృతం కురిసిన రాత్రి'లో నా అక్షరాలు వెన్నెలో ఆడుకునే అందమయిన ఆడపిల్లలు" అన్నారు. ఇతని కాలంలో కొంత అయోమయ కవిత్వం వచ్చినది. అందువలన తిలక్ పై మాటలు చెప్పవలసి వచ్చినది. తనది ఆయోమయ కవిత్వం కాదని వెన్నెలవలె స్వచ్ఛమైనదని, వెన్నెలలో ఆడపిల్లలు ఆడుకున్నట్టే తన కవిత్వవెన్నెల ద్వారా సహృదయ పాఠకుడు ఆనందాన్ని పొందవచ్చునని తిలక్ అభిప్రాయం.

గుఱ్ఱం జాషువాగారు 'రాజు-కవి' అనే కవితలో రాజు రాతి విగ్రహాలలోను కవి ప్రజల నాల్కలలోను జీవిస్తారని కవి ప్రశస్తిని చెప్పినారు. కవిత్వం వలన కవికి శాశ్వత కీర్తి వస్తుందన్న మమ్మటుని అభిప్రాయాన్ని గుర్రం జాషువాగారు ఆధునిక దృక్పథంతో చెప్పినారు. 'సామాజిక ప్రయోజనాన్ని సాధించేదే కవిత్వం' అని ఆధునిక యుగంలోని చాలా మంది కవులయొక్క అభిప్రాయం. సామాజిక ప్రయోజనాన్ని సాధించడానికే కవిత్వం ఉంటే వస్తువులకు కొదవ లేదని చెబుతూ 'కాదేదీ కవిత కనర్హం' అని శ్రీశ్రీ అన్నాడు. వరవరరావు కవిత్వాన్ని విప్లవ దృక్పథంతో చెబుతూ

కావ్యానికి ఛందస్సు ఉద్యమం
కవి సమయం తిరుగుబాటు
విప్లవం ఈ కావ్యానికి స్పందన జీవనాడి

కవిత్వం పుట్టడానికి 'విప్లవం' కారణమని చెప్పినాడు. ఒక సినీకవి 'కాలమా ఆగిపో కావ్యమై నిలిచిపో' అన్న మాటలలో కావ్యము స్థిరంగా ఉండేదనుట స్పష్టము.

ఈ విధంగా సాహిత్య లోకంలో మనకు కావ్యమును గూర్చి కవిత్వమును గూర్చి వెయ్యేళ్ళ నుండీ పరంపరంగా వస్తున్నటువంటి కవులు చెప్పడం వలన మనకు లక్షణ గ్రంథాలు లేనిలోటు తీరిందని చెప్పవచ్చు. అయితే ఈ విషయాలను క్రోడీకరించి ఏ కవి ఏ వాదానికి చెందిన వాడో వివరించే గ్రంథం ఒకటి వెలువడితే అది లక్షణ గ్రంథంగా రూపుదాల్చవచ్చు. సంస్కృత పాశ్చాత్యలాక్షణికుల విమర్శకుల తెలుగు లాక్షణికుల అభిప్రాయాలను తులనాత్మకంగా పరిశీలించ వలసిన అవసరం ఉన్నది.

పైన చెప్పిన వారిలో చాలా వరకు బాహ్య సౌందర్యములు అయిన అలంకార, గుణ, రస, రీతి వర్ణనల వంటి వాటినే చెప్పారు. ఒక్క అయ్యలరాజు రామభద్రుడు మాత్రమే ధ్వనిని గూర్చి తెల్పినవాడు. విషయ పరిశీలన చేస్తే ఇంకా అనేక అంశాలు తెలిసే అవకాశం ఉన్నది. ఏది ఏమైనా కవిత్వం ఇప్పటికి ఎప్పటికీ ఇలా ఉండాలి అని తిరువేంగళరాజు అనే కవి చెప్పిన కథ స్మరణీయము.

మధురలో నలభైమంది సంఘకవులు ఒకసారి కలహించారు. తమ కావ్యసత్యాలు చెప్పడానికి శివుడు తప్ప ఇంకెవ్వరు తగరని భావించి శివుని గూర్చి ప్రార్థించి ప్రసన్నం చేసుకున్నారు. అతడు దర్శనం ఇవ్వగానే తమ కోరికను చెప్పారు. మధురకు వచ్చి శివుడు అందరి కవిత్వం విని ఈ ఊళ్ళో కళాదుడనే వానికి రుద్రశర్మ అనే కారణ జన్ముడున్నాడు. వాడికి వినిపించండి అని ఆదేశించాడు. అయితే ఆరుద్రశర్మ, వెర్రివాడు ఇతడు మా కవిత్వం గూర్చి ఎలా చెప్పగలడు అని అడుగగా శివుడు అతను ఎవరి కవిత్వం విన్న తర్వాత కళ్ళనుండి నీరుకారుస్తాడో అతడు గొప్పకవి. ఆ రుద్రశర్మకు కవులు కావ్యాలు వినిపించగా విని కవిత్రయంవారి కావ్యాలకే పులకించి నాడు. ఈ కథ నిజమో అబద్ధమో మనకు తెలియదు కానీ ఈ కథలో చక్కని నీతి ఉన్నది. ఏ భాషలోనైనా ఏ కాలంలోనైనా ఏ కావ్యమైనా మాటలు రాని పామరుడిని సైతం ఆనందింపచేసేదే కదిలింపచేసేదే నిజమైన కవిత్వం.

# భావకవిగా విశ్వనాథ

- కట్టా గిరిజారమణ శర్మ, MA, T.P.T.

భావంలోను, భాషలోను, ఛందోరీతిలోను
విలక్షణము, స్వేచ్ఛను పొందిన కవిత్వమే
నవ్యకవిత్వము. అదియే భావకవిత్వము.

ఎగిసిపడే నురుగు తరగలతో పరుగులెత్తే జీవనది భావకవిత్వం. అది తన దారిన తాను ప్రవహిస్తూనే అనేక వస్తువులకు చైతన్యం కలిగిస్తుంది.

దేశం పట్టనంతటి మహాకవిగా కీర్తిపొందిన విశ్వనాథ వారి మాటల్లో

*కవియొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము
ఒక అంతిర్నిగూఢతాపము, ఒక చిన్ని కావ్యంలో
ఊదబడినచో అది భావకవిత్వం.

భావకవులలో విశ్వనాథవారిది విశిష్టమైన శైలి. భావ కవిగా ఆయన తన ప్రతిభను బహుముఖంగా ప్రదర్శించారు. భావనతోను, భాషతోను, చందస్సుతోను నడకతోను, శైలితోను, భావకవిత్వాన్ని పరిపుష్టం చేశారంటే అతిశయోక్తి కాదు.

చిన్న చిన్న ఖండకావ్యాలలో చక్కని చిక్కని భావావేశంతో అందమైన భావకవిత్వాన్ని నింపారు. ప్రణయమేమి, ప్రకృతేమి, దేశభక్తేమి, స్మృతేమి, అన్ని అంశాల్లో తనదైన ముద్రను వేశారు. పురాణ కవిగానే కాక భావకవిగా తన విశ్వరూపాన్ని చూపారు. ఖండ కావ్యాలతో భావకవితా సౌధ సౌందర్య దిదృక్షాపేక్ష గలవారికి మార్గం సులభం చేశారు.

ఒకానొక సమయంలో భావకవిత్వ వైశిష్ట్యాన్ని తెలుపుతూ భావకవిత్వపు వెలుగులు తమ కావ్య సౌధాలపై పడి వాని స్వయంప్రభలను కొల్లగొట్టి వెలవెల బోయేట్టు చేస్తున్నాయని, అంతేగాక భావకవిత్వపు వెలుగులే వీనికి నూతన శోభను కట్టబెడుతున్నాయని అన్నారు.

విశ్వనాథవారు "విశ్వనాథపంచశతి"లో
దేవుని పూజార్థముగా
బూవులు తెచ్చితివి సగము పువులు వలపుం
దేవేరి కట్టి పెట్టితి
భావకవుల సగము నంశపట్టెను నీకున్ అని ఒక్క పద్యం ఉన్నది. ఇది వారిని గూర్చే చెబుతున్నట్లుగా ఉంది. కానీ వారు సగం భావకవిగాదు. పరిపూర్ణ భావకవులే.

విశ్వనాథవారిలో అంతర్ముఖంగా గొప్ప భావుకుడు కూడా ఉన్నాడు. ఆ భావుకుడు కూడా విశ్వనాథవారి ప్రతిభా పాండిత్యాలను పుణికి పుచ్చుకొన్నవాడే అతడు. మరి ఊరుకుంటాడా! భావుకునిగా విశృంఖలంగా విహారం చేశాడు. కవితాధారలను వెల్లువలెత్తించాడు.

"కొండవీటి పొగమబ్బులు" అనే ఖండ కావ్యంలో కొండవీడులో విహరిస్తున్న పొగమబ్బులను చూసి తనను తాను మరచిపోయి ఆ మబ్బులతో స్నేహం చేయాలని, వానితో పూర్వ బంధమేదో కలదని భావిస్తూ

నా ప్రాణములకును నీ పొగమబ్బుల
కేమి సంబంధమో యేను గూడ
పొగ మబ్బునై కొండ చిగురు కొసలపైని
బురుజులపైనిఁ కొమ్మలకు పైని
వ్రాలిపోనో మధ్యవ్రీలిపోనో నేల
రాలిపోనో గాలి తేలిపోనో"

అనే పద్యంలో భావుకునిగా విశ్వనాథవారు స్వేచ్ఛావిహంగమే అయ్యారు. తానుకూడా ఒక పొగమబ్బునై

తెలుగు విభాగం, సెంట్రల్ యూనివర్సిటీ హైద్రాబాద్, గచ్చిబౌలి, హైద్రాబాద్ - 46.

స్వేచ్ఛగా విహరించాలని, కొండలపై, బురుజులపైన, కొమ్మలపైన, ఆగాలని మధ్యలోనే విడిపోయి చినుకులుగా రాలిపోవాలని ఆశను వ్యక్తం చేశారు.

మనసు పొరలలో గాఢంగా నిగూఢంగా ఉన్న స్వేచ్ఛా భావనయే, అలా అనిపించింది. భావకవులకు స్వేచ్ఛయే ప్రాణంకదా! ఆ భావన పురివిప్పిఆడిననెమలిలా అందంగా లలిత పదాలలో వచ్చి కుదురుకుంది ఈ పద్యం వినగానే కృష్ణశాస్త్రిగారి' ఆకులో ఆకునై కొమ్మలో కొమ్మనై అనే గీతం జ్ఞాపకానికి రాకమానదు.

" కవి ప్రతిభలోన నుండును గావ్య గత, శ
తాంశముల యందుఁ దొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి

రెట్లు గొప్పది, నవకథాధృతిని మించి అని విశ్వనాథ అభిప్రాయము. రసమే గొప్పదని రసవంతమైన రచనే రత్నమని అన్నారు. భావకవులకు కోపమొచ్చినా, ప్రణయావేశమొచ్చినా, శోకమొచ్చినా అది ఒక ఉప్పెనలా ఉంటుంది. ఇక ఆ భావాలు అక్షరబద్ధమైతే అవి రసాక్షరాలే. భావకవులు ప్రణయ కవిత్వంలో తమదైన విలక్షణశైలిని నిర్మించుకొన్నారు.

విశ్వనాథవారు ప్రణయ కవిత్వంలో కులసతి ప్రణయాన్నే స్వీకరించారు. గిరికుమారుని ప్రేమగీతాలు, శశిదూతము, శృంగారవీధి మొదలగునవి దానినే ప్రతిపాదించినాయి.

గిరికుమారుని ప్రేమగీతాల్లలో ప్రేయసిని
నీవనంత భావాలయవై విశాల
భావ సామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీ కృప సదెంత భావమేనియును సుపరి
చితమ యట్టుల దోచు నాచిత్తవీధి!

ఈ పద్యంలో భావగాంభీర్యంతోబాటు, మనో విజ్ఞానం లయాత్మక ప్రణయతత్త్వం, ఆధ్యాత్మిక మూర్తి కూడా కూడుకొని ఉన్నాయి. ప్రణయతత్త్వమంటే సర్వం ప్రియార్పణ మనడం, సమస్తశక్తులు, యుక్తులు, గొప్పదనాలు పరస్పరారోపితాలై ఉండటం అంటే త్యాగమన్నమాట.

ఇక్కడ ప్రేయసిని అనంతభావాలయంగా చిత్రించినాడు. ఆమె గుణస్వరూపిణిఅట. వ్యక్తిలో సౌందర్యగుణము గాక గుణ గణనమే చేయాలని చెప్పకనే చెప్పాడు. ఆమె విశాల భావ సామ్రాజ్య రాజ్ఞిఅట అంటే ఆమె ఈశ్వరి అన్నమాట. అనంత భావాలకు నిలయమైనది శక్తి స్వరూపిణియేకదా. ఒక భావ ప్రియుని పరముగాను, మరొకటి సృష్టిపరముగాను స్పష్టము. సమస్త సృష్టికి మాతాపితరులు పార్వతీ పరమేశ్వరులు. దీన్నే

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే!
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ !! అని

మహాకవి కాళిదాసు అన్నాడు.

విశ్వనాథవారు ప్రేయసికృపవల్ల ఎలాంటి భావమైనా పూర్వపరిచయం లేకున్నా,చిరపరిచయమున్నట్లే తోచునని అన్నారు. మనసే ప్రియురాలు, ప్రియురాలే మనసు. అయినప్పుడు అది జరుగుతుంది. భావనిలయం. మనస్సు, ప్రియరాలు భావాలయ. అంటే మనసే ఆమెయనుట. మనోకృపఉంటేనే భావాలు చిరపరిచయాలౌతాయి. మనసు బాగోలేకపోతే విషయావగాహన కలుగదు. మనోశాస్త్ర పరిజ్ఞానము కూడా విదితమగుచున్నదిక్కడ. అర్ధనారీశ్వరులగు పార్వతీ పరమేశ్వరులలో నారి హృదయసీమను ఆవరించి ఉంటుంది. అంటే మనసునన్నమాట. మనోహరికి ఈశ్వరికి అభేదం చెప్పాడు. మనోహరి ఈశ్వరి అయితే ఈశ్వరీ నాథుడు. విశ్వనాథుడు కాకుండా పోతాడా! భావసామ్రాట్టు కాకపోతాడా!

ప్రణయ కవిత్వంలో మధురంగా భక్తిని ఆధ్యాత్మికతను చొప్పించినాడు.

"శశిదూతం"లో కూడా కులసతీ విరహాన్ని అనుభవించి విరహసందేశాన్ని చంద్రుని చేత పంపించడం గలదు. వస్తువు పాతదే అయినా దూతవిషయంలో, వర్ణనల విషయంలో క్రొత్తదనం కనిపిస్తుంది.

చంద్రుణ్ణి దూతగా స్వీకరించి ఆతని సహాయం అర్థిస్తూ అతన్ని పొగడటంలో వైవిధ్యం కనిపిస్తుంది. ప్రియురాలి విరహాన్ని తొలగించి ఎలాగైనా సరే ప్రియురాలిని

తన చెంతకు చేర్చమని పలువిధాలుగా ప్రార్థించాడు. విరహానలంలో కాగిపోతూ చంద్రున్ని కార్యం చేసిపెట్టుమని అభ్యర్థిస్తాడు. అంతలోనే అనుమానిస్తాడు. మళ్ళీ వేడుకొంటాడు. ప్రియావిరహంలో స్నేహితులను కూడా శత్రువులుగా భావించడం. మళ్ళీ వారిని ప్రసన్నులను చేసుకోవడం ప్రణయజీవులకు విదితమే.

చంద్రుడు, వనితలు, పూలు ఒకే మోస్తరు కోమల జీవులని, ఒకే కుటుంబీకులని సిద్ధాంతం చేశాడు. ఆయనను ఎన్నో విధాలుగా పొగడి ప్రియురాలికి సందేశం అందించమన్నాడు. ప్రియురాళ్ళతో విహరిస్తున్న చంద్రుని నీవు అలా ఉండి నన్ను బాధ పెడుతున్నావు నాకు లేని సౌఖ్యం పొందుతున్నావని

"ఒక పట్టున నీవు సతుల్ సమైక్యమై వెలిగెదరు

బాధపెట్టెదరు" అంటూ ఈ మాటల్లో ఒక ప్రియుని బేలతనము స్పష్టంగా వ్యక్తం చేశాడు. ఏం మాట్లాడు తున్నాడో తెలియకనే మాట్లాడేస్తున్నాడు వాడు. ఆ మాటలకు చంద్రుడు నవ్వుకొన్నాడని అంటాడు. మళ్ళీ అంతలోనే చంద్రుణ్ణి

"నిను సకలౌషధీశునిగ నేను నెఱుంగుదు" అంటాడు. ప్రియా విరహంలోని బాధను తొలగించడానికి ఓషధి కావాలి. ఓషధీశుడే అట్టి సహాయం అందించగలడు. ఈ మాటలోనే విశ్వనాథవారు చంద్రుణ్ణి దూతగా స్వీకరించిన కారణం చెప్పినట్టు అయ్యింది. ఈ ఖండ కావ్యంలో అడుగడుగునా ప్రణయం విప్రలంబ ముఖంగా, ఎగసిపడే కెరటాల స్రవంతిగా పరుగులు తీసింది. ఆయన ఆత్మీయతకు ఈ ఖండకావ్యం చక్కని ఉదాహరణ.

ప్రకృతి కవిత్వాన్ని కూడా విశ్వనాథవారు రసవాహినిగా దూకించినారు. పల్లెలు, పొలాలు, గుట్టలు, మిట్టలు, ఏరులు, వారులు, కొండలు, కోనలు, కోనసీమఅందాలు, కోయిలమ్మ పాటలు, ఋతువుల కోలాహలం, చిలకమ్మల చిలిపిపదాలు, ఒకటేమిటి ప్రకృతిలోని అణువణువును తడిమి తడిమి, తనివితీరా చూచి కవితాగానం చేశారు. కోకిలమ్మపెళ్ళి, కిన్నెరసాని పాటలు, తెలుగు ఋతువులు, ప్రకృతి ప్రాధాన్యంగల ఖండకావ్యాలు ప్రకృతిలో మమేకమైన ఋషిగా అద్భుత సృష్టిచేశారు.

"కోకిలమ్మపెళ్ళి" ఒక ఉదాత్త భావవీచి. దీన్లో "కోకిలమ్మకు వసంతునికి" వివాహం జరగటం విశేషం. కరుణరసాత్మకంగా మొదలై అద్భుతరసంతో పరాకాష్ఠనందు కోవడం సహృదయులను ఆకర్షిస్తుంది.

కోకిలమ్మను వసంత ఋతువనే పురుషునికిచ్చి వివాహం చేయడం. దీని వెనుక ప్రకృతి ధర్మం గమనిస్తే అద్భుతం అనిపించకమానదు విశ్వనాథ మదిలో ప్రకృతి ధర్మాలు, విశేషాలు, రహస్యాలు నిలిచి ఉన్నాయేమో లేకపోతే ఇలాంటి అనన్య సామాన్యమైన భావన ఆయన నుండి జాలువారి ఉండేదికాదు. ఈ విషయమే సినిమా పాటగా కూడా మారింది. "కోకిలమ్మపెళ్ళికి కోనంతా పందిరి" అంటూ, కిన్నెరపాటలు రసవాహినీ తరగలు, భావతరంగిణుల స్నేహితులు. వస్తువులోను, వర్ణనలోను, ఛందస్సులోను, భాషలోను, క్రొత్తదారులు త్రొక్కిన పాటలివి. విశ్వనాథ మదిలో విరులతేనె చినుకుగా కూనలమ్మ పలుకుగా,కూచిపూడి నడకగా సాగింది. కిన్నెరసాని, వనిత వాగుగా మారడం ఇందులోని భావుకత. కిన్నెరసానిని ఉద్విగ్న హృదయగా, మువ్మూర్తులా తెలుగింటి ఆడపడుచులా చిత్రించారు. బాధల బరువులను మోయలేక కరిగి నీరై నేలజారిపోయింది. ఈ పాటలు ఆయనకు బాగానచ్చినాయట. ఈ పాటలు వ్రాస్తునప్పుడు ఒకరోజు భోజనంవేళ దాటిపోతుండగా ఆయన సతీమణి వచ్చి భోజనానికి లేవండి అని పిలిచిందట. ఎంతకూరాలేదు. ఏమిటో సంగతని వచ్చి మళ్ళీమళ్ళీ పిలిచి విసిగిపోయి, నన్ను, భోజనాన్ని వదిలేసి ఆ సానిదానివెంట పడ్డారేం అని కోపంగా అన్నదట. దానికాయన చిరునవ్వుతో నీవు నన్ను అంతగా ఆకర్షించి ఉంటే మరోదానివెంట పడేవాణ్ణా అంటూ కిన్నెరసానిలో మళ్ళీ ప్రాయోపవేశం చేశాడట. కిన్నెరసాని పాటలలో విశ్వనాథ వారి ఆత్మను దర్శింపవచ్చు. కిన్నెరసానిగా వారు విశృంఖలంగా స్వచ్ఛమైన భావుకునిగ బావుటా ఎగరేశారు.

విశ్వనాథవారు సనాతన సాంప్రదాయవాదిగా అడుగడుగునా కనిపిస్తారు. భక్తి హృదంతరాళాలలో

నిగూఢంగా ఉండాలని భావించారు. ఆధ్యాత్మిక, భావాలతో అనేక శతకాలు రచించారు. వాటిలో వేదాలలోని, ఉపనిషత్తులలోని రహస్యాలనే గాక, స్వాభావికమైన ఆవేశాన్ని, లోకజ్ఞతను, భావావేశాన్ని రంగరించాడు. ''గోపికాగీతికలు'' ''శృంగారవీధి' ''భ్రమరగీతాలు'' ఆధ్యాత్మికతతో వ్రాయబడినవి.

"గోపికా గీతికలలో"

"మనసు పొలంబు దున్నితిని మాధవ భావము నందు విత్తితిన్" అనే మాటల్లో ద్వైతభావం ధ్వనిస్తుంది. మాధవుణ్ణి మనసు పొలంలో నాటడం కనిపిస్తుంది. ఆత్మ, పరమాత్ముల సంయోగాన్ని అద్భుతంగా చెప్పినారు. విభిన్నమైన ఆత్మపరమాత్మలకు సంయోగానంతరం ఏకమవడం చిత్రించాడు. ద్వైతాద్వైత భావం చక్కగా వివరించాడు. భక్తి శతకాలలోను ఇది దర్శనీయము.

దేశభక్తి విషయంలో విశ్వనాథవారు అంతస్సూత్రమైన సంప్రదాయాన్ని ఆధారం చేసుకొన్నారు. వారి కావ్యాలలో అడుగడుగునా హిందూ సంప్రదాయం కనిపిస్తుంది. "ఆంధ్ర ప్రశస్తి" "ఆంధ్రపౌరుషం" మొదలగు ఖండకావ్యాలలో వారి దేశభక్తి పొంగిపొర్లింది. ముఖలింగంలో దేశం స్థితిని గ్రహించి బాధతో

"పాడిన గీతమే మఱల పాడెద గూడిన భావమే మఱిం గూడెద నేమి సేయవలె గుండియ శోషిలు దుఃఖవేదనన్ అని వాపోయాడు. దానిని జాగృతం చేయడానికి

అంతలోనే విస్మృతి గల్గెనా! తెలుంగు
జాతి జాతీయగీతికా జనిత దివ్యమధుర మధురస
సంపూర్ణ మంజులారవ ప్రభూత సమ్మోహన
ప్రథితకీర్తి!

అని ప్రబోధ చేశారు. దేశభక్తితో. స్మృతికావ్యాలలో ''వరలక్ష్మిత్రిశతి'' పేర్కొనదగినది. సతీమణి స్మృతిగా వ్రాశారు. ఈ కావ్యం ఆయన హృదయపుటలను పంచుకొంది. మనసున మనసైన మనిషి లేడన్న విషయం భరించలేక ఆర్తిగా ఆయన అనురాగం అశ్రువులై ఆ అశ్రువులే, అక్షరాలై చిరంజీవులైనాయి. ఈ కావ్యంలో ఆయన పాండితీ ప్రకర్షతోపాటు సతిపట్ల వారికున్న అనురాగం పోటీపడింది. దీన్లో శాస్త్రాలు, ఉపనిషత్తులు, అనేక విషయాలు చోటు చేసుకోవడం విశేషం.

భావంలోను, భాషలోను, ఛందోరీతిలోను,

విలక్షణమైన నవ్యత్వాన్ని చూపారు. అనన్య సామాన్య రీతిలో భావకవిత్వ శాఖలైన ప్రణయ కవిత్వాదులను ఖండకావ్యాలుగా చెక్కినారు రసాక్షరశిల్పి.

విశ్వనాథగారు ప్రణయలోకంలో గిరికుమారుని ప్రేమగీతాలు పాడి, ప్రకృతికే ప్రకృతిగా కోకిలమ్మపెళ్ళి చేసి, నురుగుతరగల రమణి కిన్నెరసానికి పాటల నీరాజనాలిచ్చి, ఆధ్యాత్మికత పరాకాష్ఠనందుకొన్న పద్యశతాలను చేసి, దేశౌన్నత్య ద్రష్టగా, మార్గదర్శిగా ఆంధ్రప్రశస్తిని చాటి, సతీ స్మృతి పథంలో సాగిపోయి, భావుకునిగా, ఉదాత్తశీలిగా భావకవితా బావుటాగా నిలిచారు.

విశ్వనాథవారు కవితా సర్వం సహచక్రవర్తి. నా మాటలలో వారు.

ఉ॥ భారత భారతీ జయము భాగ్యవిశాలత వేదరూపముం
సారతసాహితీ లలిత సంద్రము కావ్యమనోజ్ఞ రాజ్యముం
ధీరత ధర్మవర్తనవిధేయత సంస్కృతి కాంక్ష రూపముం
హారిత విశ్వవాణికి విహార సమీరము విశ్వనాథుడున్.

సీ॥ పలుకుల చేతనే పలికించ గలడయ
పలుకని మనసుల పలుకు లన్ని
కావ్యధారలతోనె కదిలించ గలడయ
కొండ కోనల దిర్గు కోర్కెలన్ని
కరకు గుండియలెల్ల కరిగించ గలడయ
కావ్య పఠనమెంతొ దివ్యమనగ
పరిమళింపగలడయ రమణీయ కలిత
సహృదయ సీమలన్ సరస కవిగ
విశ్వనాథుడగుచు విశ్వవీణమీటి
తెలుగు కవితా గరీయసి పలుకుదెలిపె
భావకవితా విశారదా భరణు డయ్యె
సాటిలేని సమ్రాట్టుగా మేటి ఋషిగ.

# భాసుని సూక్తులు

- డా॥ ఎ.బి. సాయిప్రసాద్

కాళిదాసుకు ముందు పుట్టిన భాసుడు మంచి మాటలకు మారుపేరుగా ఈ రోజుకూ భాసిల్లుతూ వస్తున్నాడు తన నాటకాలలో భాసుడు కలకాలం నిలచిపోయే ఎన్నో జీవిత సత్యాలను వెల్లడించాడు. సిద్ధాంతాలకు కాలదోషం పట్టే అవకాశం వుండేమోకాని అనుభవసారమైన భాసుని సూక్తులకు కాలదోషం పట్టే అవకాశం ఏమాత్రం లేదు. అచార్యదండి "భాసః శరీరైతివ నాటకైః" అన్నారు కాని నిజం చెప్పాలంటే భాసుడు సూక్తికారుడిగానే అమరుడయ్యాడు.

కవి కులగురువు జయదేవుడు తన ప్రసన్నరాఘవం లో వాడిన మాటగా పరిగణింపబడుతున్న భాసుడు గురుతర బాధ్యతలను బాగా ఎరుగున్న మనిషి అధ్యాపకత్వం కత్తిపైసాములాంటిది. గురువన్నవాడు భాసుడి దృష్టిలో శిష్యుల భవిష్యత్తును తీర్చిదిద్దే వ్యక్తి. శిష్యదోషానికి బాధ్యత గురువే వహించాలంటూ భాసుడు ద్రోణుడు మాటలద్వారా తన పంచరాత్రంలో దృవీకరిస్తాడు.

బాలంహ్యపత్యం గురవే ప్రదాతుం

అధ్యాపక వృత్తిని చేబట్టిన వారికి లేదా చేబట్టాలనుకున్న వారికి భాసుడి మాటలు చక్కటి దారిని చూపుతున్నాయి.

రేపటి పౌరులను తీర్చిదిద్దే గురువును ఎలా గౌరవించాలో కూడా భాసుడు తన పంచరాత్రంలో సూచిస్తాడు. విద్యను బోధించే గురువు దరిద్రుడిగా ఎప్పుడూ వుండరాదంటాడు. అలా జరిగితే రాజుదగ్గరనున్న ధనానికి ఏమాత్రం విలువ వుండదంటాడు. కింతద్ద్రవ్యం కిం ఫలం కో విశేషః కింయత్ర విప్రో దరిద్రః గురువు కోసం తమ సర్వస్వం అర్పించగల శిష్యుల అవసరం కూడా ఎంతో వుందని భావించిన భాసుడు, దుర్యోధనునితో యిలా పలికిస్తాడు. 'హస్తే స్థితా మమగదా భవతశ్చ సర్వం' అంటే నాచేతిలో గదవున్నంత వరకు నాదంతా మీకే స్వంతం. ద్రోణుడు లాంటి గురువు దుర్యోధనుడిలాంటి శిష్యుడు వున్నప్పుడు దేశం సుభిక్షంగా వుండగలదన్న ఆశావాదాన్ని భాసుడు పంచరాత్రం ద్వారా ప్రజల కందించాడు.

తల్లి దండ్రులలో ఎవరు గొప్ప? ఎవరి మాటను కాదనకూడదు? ఇలాంటి ప్రశ్నలు మనకు ఎదురవుతూ వుంటాయి? ఈ ప్రశ్నలకు సమాధానం యిస్తూ ఈ భూమిపై తల్లే గొప్పది. తల్లి మాటలనే పాటించాలని భాసుడు తెలియజేశాడు. 'మధ్యమ వ్యాయోగం'లో భీముడు తల్లి శ్రేష్ఠత్వాన్ని ఘటోత్కచునకు ఇలా తెలియజేస్తాడు. "మాతాకిల మనుష్యాణాం, దైవతానాంచ దైవతమ్" తల్లి దేవతల దేవత అని తెలుసుకున్న ఘటోత్కచుడు తన ఎదుటనున్న వ్యక్తి తన తండ్రేఅన్న విషయం తెలియక బ్రాహ్మణ కుమారుణ్ణి వదలమని నాతండ్రిగారు చెప్పినా నేను విననంటాడు. భర్తకు ద్రోహం తలబెట్టే భార్య మాతృస్థానాన్ని కోల్పోతుందని 'ప్రతిమ' నాటకంలో భరతుడి ద్వారా చెప్పించి తల్లులకు కూడా ఒక హెచ్చరిక లాంటిది

పచ్చయప్పా కాలేజి, మద్రాసు.

ఇవ్వడానికి భాసుడు వెనుకాడలేదు.

దేశస్వాతంత్ర్యాన్ని శక్తి సామర్ధ్యాలతో పొందవలెనే గాని యాచించి మాత్రం కాదని భాసుడు సుమారు రెండు వేల సంవత్సరాల క్రిందటే చెప్పాడు. దూత వాక్యంలో దుర్యోధనుడు కృష్ణునితో అన్న మాటలను వినండి.

రాజ్యం నామ నృపాత్మజైః సహృదయైఃజిత్వా రిపూన్ భుజ్యతే.
తల్లోకే నతు యాచ్యతే నతు పునర్ దీనాయ వా దీయతే

రాజన్నవాడికి దూరదృష్టి అవసరం దుస్సాహసం భాసుడు కూడదంటాడు.

'కృషితోనాస్తి దుర్భిక్షం' అన్న మాటను భాసుడు రాజుల పరంగా వాడుతూ కర్ణుడితో పలికించిన మాటలు నిప్పులాంటి నిజాలు. దేవేంద్రుడితో మాట్లాడుతూ కర్ణుడు యిలా అంటాడు 'ధర్మోహి యత్నైః పురుషేణ సాధ్యో'. అంతటితో ఆగక "భుజంగ జిహ్వా చపలా నృపశ్రియః' రాజ్యం పామునాలుకలా నిలకడలేనిది అని కూడా అంటాడు. రాజ్యపాలనలోని కష్టనష్టాలను చక్కగా భాసుడు చెప్పాడు.

ఆస్తిపాస్తులు తోడురావు. మంచే తోడుగా వస్తుందన్న ఆప్తవాక్యాన్ని మనం వింటూ వుంటాం. ఈ మాటల మొదటి రచయిత భాసుడే అయివుంటాడు. కర్ణుడు శల్యుడితో చెప్పిన మాటలు మనల్ని ఎంతగానో ఆలోచింపజేస్తాయి.

శిక్షా క్షయం గచ్ఛతి కాల పర్యయాత్
సుబద్ధ మూలా నిపతంతి పాదపాః
జలం జలస్థానగతం చ శుష్యతి
హుతం చ దత్తం చ తదైవ తిష్ఠతి

చదువు, చెట్లు, నీళ్ల కాల ప్రవాహంలో కొట్టుకొని పోతాయి. కాని చేసిన దాన ధర్మాలు కలకాలం నిలిచి పోతాయి. పరోపకారార్థమే ధనాన్ని వాడాలన్న దివ్య సందేశాన్ని భాసుడు కర్ణుడి ద్వారా మనకందజేస్తున్నాడు.

ప్రజాపాలన రాజు లక్ష్యంగా వుండాలంటాడు కర్ణుడు. తన కర్తవ్య నిర్వహణలో రాజు చాలా జాగ్రత్తగా వుండాలని అవిమారక నాటకంలోని కుంతిభోజుడు అంటాడు. కుంతిభోజుని మాటలు మనల్ని ఆలోచించేలా చేస్తాయి. మంత్రులు ఏం ఆలోచిస్తున్నారో తెలుసుకోవాలి, కోపతాపాలను కప్పిపుచ్చుకోవాలి. అవసరాన్ని బట్టి కుసుమాదపి కోమలంగానూ వుండాలి. వజ్రాదపి కఠోరం గానూ వుండాలి. ప్రజలు ఏమనుకుంటున్నారో, వారు ఎలా ఆలోచిస్తున్నారో తెలుసుకుంటూ వుండాలి. చుట్టు ప్రక్కలవున్న రాజ్యాలు ఎలా వున్నాయో వేగులద్వారా ఇతరుల కళ్ళతో చూచి తెలుసుకోవాలి. ప్రయత్నంతో తనతలను కాపాడుకుంటూ వుండాలి. కాని రణ రంగంలో మాత్రం అందరికంటే ముందు తలను పణంగా యివ్వడానికి సిద్ధంగా వుండాలి. "పూజ్య బాపూజీ కలలుకన్న రామరాజ్యానికి భాసుడు ఆనాడే నాంది పలికాడు. రాజు ఎలా జీవించాలో భాసుడు తన పంచరాత్రంలో కర్ణుడి నోట యిలా పలికిస్తాడు.

నష్టాః శరీరైః కృతిబిః ధరంతే.

రాజుపని కష్టమైనదనుకుంటే అంతకు రెండింతలు కష్టమైన పని మంత్రిదని భాసుడు తెలియజేస్తాడు. ప్రజల మనస్తత్వాన్ని 'అవిమారకం' నాటకంలోని మంత్రి చాలా చక్కగా అర్థంచేసుకొని 'కష్టం అమాత్యత్వం' అంటాడు. మంత్రిసలహా పాటించి నందువల్ల మంచి జరిగితే ప్రజలు రాజును పొగుడ్తారు. అదే సలహా ఎదురుతిరిగి అపాయం సంభవిస్తే ప్రజలు మంత్రిని దూషిస్తారు. ఇది అక్షరాల నిజం.

మనుషుల స్వభావాన్ని అర్థం చేసుకోవడంలో భాసుడు అందెవేసిన చెయ్యి. మనచేతికో లేదా కాలికో దెబ్బ తగిలితే కన్నే కన్నీరు కారుస్తుంది. అదే విధంగా స్వజనులు తప్పుచేస్తే బాధ యింటి పెద్దకే కలుగుతుంది. దుర్యోధనుడి చెడుచేష్టలను ప్రస్తావిస్తూ వాసుదేవుడు

...టుసల అన్న మాటలు ఎంతో అర్థవంతమైనవి. స్వజనులు చేసే గాయాలు పగవారు చేసే గాయాల కంటే ప్రమాదకరమైనవని భాసుడికి బాగా తెలుసు. అందుకే ప్రతిమా నాటకంలో భాసుడు తన భావాలను రాముడి మాటలలో ఇలా వ్యక్తం చేస్తాడు. పగవాడు శరీరమును మొత్తును. స్వజనము హృదయమును మొత్తును". (జి.వి. కృష్ణారావు అనువాదం). కృతజ్ఞతా-గుణమున్న వ్యక్తులు చాలా అరుదుగా వుంటారంటూ స్వప్నవాసవదత్తలోని వత్సరాజు సెలవిస్తాడు.

రోషం కామం కారణంగా మనం తప్పుడు పనులు చేస్తుంటాం. నింపాదిగా ఆలోచిస్తే మన తప్పులు మనకు తెలిసివస్తాయి. తనను దూషిస్తున్న రావణుడితో విభీషణుడు 'అభిషేకం' నాటకంలో అదే అంటాడు.

పెండ్లికెదిగిన కూతురు తల్లిదండ్రుల యెదపైన ముఖ్యంగా తల్లి ఎదపైన కుంపటి అని పెద్దలు అంటుంటారు. పెండ్లి చేయాలన్న ఆతురతా, చేసిన పక్షంలో ఎడబాటు రెండూ తల్లిని పీడిస్తూ వుంటాయి. తల్లి మనసుకు అద్దంపడుతూ స్వప్న వాసవదత్త నాటకంలోని మహాసేనుడు.

అదత్తే త్యాగతా లజ్జా దత్తేతి వ్యథితం మనః

ధర్మస్నేహాంతరే న్యస్తా దుఃఖితాః ఖలు మాతరః

ఈ శ్లోకాన్ని చదవిన తరువాతే కాళిదాసు కణ్వుని పాత్రద్వారా తండ్రి మనసును వ్యక్తం చేసి వుంటాడు. మహాసేనుడి మాటలు విన్న రాణి రాజుతో " అట్లా అయితే మహారాజా మనకు ఎప్పుడూ మనఃక్లేశాన్ని కలిగించని వ్యక్తితో అమ్మాయిపెండ్లి చేయండని సలహాయిస్తుంది.

కష్టాలను దుఃఖాన్ని పిన్నవయసులోనే అనుభవించడం శ్రేయస్కరమని భాసుడు భావిస్తాడు. సుఖం అనుభవించిన తరువాత దుఃఖాన్ని అనుభవించడం బాలా కష్టమైన పని. అటువంటివ్యక్తి జీవచ్ఛవంగా మారుతాడని సూచిస్తాడు. చారుదత్తనాటకంలోని నాయిక మాటలు వినండిః

సుఖం హి దుఃఖాన్యనుభూయ శోభతే

యథాంధకారాదివ దీపదర్శనం

సుఖాత్తు యోయాతి దశాం దరిద్రతాం

స్థితం శరీరేణ మృతః సజీవతి

సాధనతో ధరలో పనులన్నీ సమకూరుతాయని మనకు శతక కారులు ఎప్పుడో చెప్పారు. వారి మాటలకు కావలసిన ప్రేరణ ప్రతిజ్ఞా యౌగంధరాయణంలోని ప్రథమాంకంలోని చివరి మాటలలో మనకు కనిపిస్తాయి.

కొయ్యను వేగంగా తిప్పితే అగ్గి రాజుకుంటుంది

భూమిని త్రవ్వగా త్రవ్వగా నీరు వూటగా లభిస్తుంది

ఉత్సాహంతో పనిచేస్తే అన్నీ హస్తగతం అవుతాయి

సరైన ప్రయత్నం చేస్తే మంచి ఫలితాలు దక్కుతాయి

విసుగు చెందకుండా ప్రయత్నించే వారిదే అంతిమ విజయం అన్న మాటను చాటిచెబుతూ నేటి యువతలో వుత్సాహపు అగ్నిని రగిలిస్తున్న భాసుడు యశఃకాయుడు.

# కృతఘ్నత - మంచన నైతిక సందేశం

- సూర్యదేవర రవికుమార్

మంచన కవి రచియించిన 'కేయూరబాహు చరిత్రము' అన్న కథాకావ్యానికి సంస్కృతంలో రాజశేఖరకవి రచించిన 'విద్ధసాలభంజిక' అనే నాటిక మూలం. దాని నాధారంగా జేసుకొని సందర్భానుగుణంగా చాలా నీతి కథలను చేర్చి చెవులకు వినసొంపుగా ఉండేటట్లుగానూ, ప్రబంధరచనా పద్ధతిలోనూ తన కావ్యాన్ని రచించాడు. ప్రస్తుతం 'కృతఘ్నత' అన్న కథ ద్వారా జంతువుల నడ్డం పెట్టుకొని మనుషులకు ఎలా బుద్ధిచెప్పాడో చూద్దాం.

పూర్వం ఒక అడవిలో తనబలిమిచేత సర్వ జంతువులను వశపరచుకోవటంలో పేరుగాంచినటువంటి వయస్సు మళ్ళిన ఒక శార్దూల ముండేది. దాని కొకనాడు ఆకలి బాగా వేయటంతో ఒక జంతువును వేటాడి మాంసాన్ని తింటూ ఉండగా వాడియైన ఎముక ముక్క ఒకటి దాని కోఱలసందులలో ఇరుక్కుపోయింది. అది దినదినానికి నొప్పి ఎక్కువై ఇక భుజించడానికి వీలుగాక నోటిలో ధారావాహికంగా లాలాజలం కారుతోంది. ఇదంతా మానుమీద నుంచి గమనిస్తున్న ఒక వడ్రంగిపిట్ట ఆ పులిరాజుతో ఇలా అన్నది.

నొవ్వి అలంపకూసెదవు నో రొకమాఱును మూయలే వేలొకో
తివ్వలు కాల జుట్టినను దెంపగలేవు తరక్షునాథ! నీ
కివ్విధమైన ఆపదకు నేది కతంబు విధాత అక్కటా!
యెవ్వరి నెట్లు సేయడు విహీనమతిం బ్రతికూలుడైన చోన్.

"పులిరాజా నొప్పితో అలసిపోయేటట్లుగా అరుస్తున్నావు, నోరొక్కసారిగా మూయలేవు, తెరువలేవు ఎందుకు? నీ ఆపదకు కారణమేమి! విధి ప్రతికూలమైతే ఆ విధాత ఎవ్వరి నేమి చేస్తాడో కదా!"

తాను పొందిన బాధనంతా ఆ ద్రుమకుట్ట విహంగానికి చెప్పింది పులి. 'ఈ ఎముకను నేను బయటకు తీసి నీకు మేలు చేస్తా'నని ఆ వడ్రంగిపిట్ట అన్నది. దానికి పులి ఈ విధంగా అంటున్నది.

అనవుడు చిత్రకాయము ప్రియంబున నట్టిదయేని నొక్కమే
లని మితి సేయ నేమిటికి నాప్తసఖుండగ నిన్నుజేసి యే
వనమున నేమి జంతువు నవారణ జంపిన మాంస మర్ధముం
గొనుమని యిత్తు నే హితము గోరిన జేయుదు నీకు
నెచ్చెలీ!

"నీవు నా పంటిసందులలో ఇరుక్కున్న ఎముకను అలా తీసినట్లయితే నీ కొక మేలు చేస్తానని పరిమితం చేసి చెప్పటం దేనికి? నేను ఏ వనంలోనయినా సరే ఏ జంతువును చంపినా అందులో అర్ధమాంసము నీకు ప్రీతితో ఇస్తాను ప్రియమిత్రమా!" అని అంటుంది పులి.

నావుడు పెద్దయు విప్పగ,
నీ వదనము తెఱవు మనుచు నియమించి దురం
తావిర్భావిత సాహస
యై విహంగంబందు జొచ్చె నతి నిపుణతతోన్.

5-29, భైరవనగర్, ఇంజనీరింగ్ కాలేజి(పోస్టు), అనంతపురం - 515 002

'నీ నోరు పెద్దగా తెరచి అట్లే ఉండు' మని పిట్ట వ్యాఘ్రంతో చెప్పి తాను అత్యంత సాహసంతో నైపుణ్యంగా పులి నోటిలోకి పోయింది.

దంష్ట్రికలు పాదమున గొని తన్ని సంధి
సున్న ఎముకను సంచున నూడిపట్టి
పాపి కదిలిచి పెఱికి ఆ పక్షి అధిక
వేగమున పులివాగడ వెడలిపోయి

ఆ విహంగం దంతాలను తన పాదాలతో ఎగదన్ని పంటి సందులో నున్న ఎముకను తనముక్కుతో ఊది పట్టుకొని అటూయిటూ కొద్దిగా కదిలించి ఆ ఎముకను పెరికివేసి ఎంతో వేగంతో పులి నోటిలోనుంచి బయటకు బుర్రున పోయింది.

ఇక్కడ అత్యంత సహజమైన వర్ణన చేశాడు మంచనకవి. పాదాలతో ఎగదన్ని అటూయిటూ కదలించి అటు తర్వాత పక్షి వెంటనే బయటకి రావటం మొదలైన విషయాలు సహజంగా ఉన్నాయి.

ఆ తర్వాత వడ్రంగిపిట్ట చెట్టుకొమ్మనెక్కి ఎముకను ఉమిసివేసింది పులినోటినొప్పి కూడా తగ్గిపోయింది. క్రమేణా నోటిలో అయిన పుండుకూడా ఆ వ్యాఘ్రానికి మానిపోయింది. పుండు మానిపోయిన తర్వాత ఒక పెద్దజంతువును వధించుకొని ఒకచోట వేసుకొని తినటానికి మొదలుపెట్టింది. అప్పుడు ఈ వడ్రంగిపిట్ట పులికి ఎట్టఎదుట నిలచి "మృగరాజా! నా భోజనానికి సరిపడా మాంసం పెట్టు, నాతో మృదువైన పలుకులు కొన్ని పలుకు' అన్నది. వెంటనే పులి ఇలా అంటున్నది.

నీ వెవ్వరు మాంసంబే
లా వలసె న్నీకు నేను లంచము వెట్టన్
నీవు పులుగ వే మృగపతి
నా వచనమ్ముల ప్రయోజనము నీకేలా?

"నీ వెవ్వరవు? నీకు మాంసమెందుకు కావలసి వచ్చింది. నీకు నేను లంచమివ్వాలా! నీవు పక్షివి, నేను మృగరాజును నా మృదుసంభాషణతో నీకేమి పని" అని పిట్ట మనస్సు నొచ్చుకునేటట్టుగా అన్నది పులి.

అనవుడు నెఱుగవె నన్ను వ
దనకుహరములోనఁ జొచ్చి దౌఁడలయెడ నా
టిన శల్యము పెఱికిన చెలి
చనునే నను మఱువ నీకు శార్దూలపతీ!

"నేను తెలియదా నీకు! నీ నోటిలోపలికి పోయి దౌడలలో నాటుకొన్న మాంసపు ఎముక ముక్కను పెరికి వేసిన చెలిని నేను. అలాంటి నన్ను మరచిపోవటం నీకు భావ్యమా శార్దూలపతీ!" అని పిట్ట తాను చేసిన మేలును ఒకసారి గుర్తుకు తెచ్చింది.

అప్పుడు ఆ పలుకులను విని నవ్వుతూ పులి పిట్టతో ఈ విధంగా అంటోంది.

కాయ లుడివోయినట్టి వృక్షంబు, పాడి
యెల్ల గడచిన ధేనువు, నేఱు గడపి
నతడు, కార్యము దీర్చిన యతడు నపుడ
గాని ఆదరణీయులు, కారు పిదప.

'కాయలు ఒడుపుకున్న తర్వాత ఆ వృక్షంతోనూ, పాలు పితికి ఎండిపోయిన ఆవుతోనూ, ఏరు దాటించిన తర్వాత ఆ మనిషితోనూ, ఒక మనిషిద్వారా కార్యము నెరవేర్చుకున్న తర్వాత అతనితోనూ ఇక మనకు పనిలేదు. వాళ్ళందరూ మనకు పని పడినప్పుడు ఆదరణీయులుకాని తర్వాత వారి నాదరించవలసిన పనిలేదు" అని దృష్టాంతాలు కూడా చెబుతాడు పులిరాజు.

ఇక్కడ మంచనకవి ఒక కుటిలుడు తన కార్యం సాధించుకునేటంతసేపూ ఎలా ఉంటాడు! ఆ కార్యం

ప్రతీకార మలా తీర్చుకొని ఇక తన దారిని తాను వెళ్ళిపోయింది పిట్ట. ఆ కంటినొప్పి ఎక్కువకాగా దాని బాధ భరించలేక మిక్కిలి వాపోతూ అటూయిటూ తిరిగి తన కృతఘ్నత్వానికి తానే హతమైపోయింది పులి. ఒక కంటికి రోగం వచ్చినప్పుడు ఆ కంటికి వైద్యం చేయించి, రెండవకంటికి రాకుండా చూసుకోవాలి. లేకపోతే ఆ కంటిగోడు ఇవతలి కంటికి కూడా తగిలి అది కూడా పోయే ప్రమాదముంది. ఆ విధంగానే పొడిచింది ఒక కన్నైనా నొప్పిని భరించలేక అటూయిటూ తిరిగి చనిపోయింది పులి.

ఇక్కడ ఓ మృగమా! అని పిట్ట పిలిచింది. ఇంతకు ముందు మృగపతీ! అని గౌరవించింది. ఆ పిలుపులో తేడా ఉంది. ఆ గౌరవం పులిరాజు పోగొట్టుకున్నాడన్నమాట.

అల్పుడేకదా! వీడు నన్ను ఏమి చేస్తాడులే అని అనుకుంటుంది లోకం. ఆ అల్పుడే తెగిస్తే ఎంత పనైనా చెయ్యగలడు అన్న సంగతి అప్పటికి తెలియదు. తర్వాత తెలిసివస్తే ఏమి లాభం! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లుంటుంది. చేసిన మేలు మరచిపోవటమన్నది దుర్మార్గుల లక్షణం. ఒక గ్లాసెడు మంచినీళ్ళు ఇచ్చిన వారినిగాని, పరస్థలంలో భోజనం పెట్టినవారినిగాని, ఆపత్సమయంలో ఆదుకున్నవారినిగాని ఆదర్శ పురుషు డెన్నడూ మరచిపోడు (ఇక్కడ పురుషుడంటే జీవుడు అని అర్థం. మగవాడు కావచ్చు, స్త్రీ కావచ్చు). తన జీవితాంతమూ గుర్తు పెట్టుకుంటాడు. తన బంధుమిత్రులతో సందర్భం వచ్చినప్పుడెల్లా ఆ విషయాన్ని ఎన్నిసార్లు గుర్తుకు తెచ్చుకుంటాడో! అదీ కృతజ్ఞత. మేలు చేసినవానికి మేలు చేయకపోగా కీడు కూడా తలపెట్టేవాళ్ళున్నారు. వారికి ప్రకృతిపట్ల ఉదాత్త బుద్ధి ఉండదు. అవతలివాడికీ ఒక సమయమంటూ వస్తే మనగతి ఏమవుతుందన్న ఆలోచన ఉండదు. వీటన్నిటిని దృష్టిలో పెట్టుకునే మనుషులకు బుద్ధి చెప్పాలనే మంచన మంచి నీతి సందేశాన్ని అందించాడు ఈ 'కృతఘ్నత' అన్న కథ ద్వారా.

ప్రతీకార మలా తీర్చుకొని ఇక తన దారిని తాను వెళ్ళిపోయింది పిట్ట. ఆ కంటినొప్పి ఎక్కువకాగా దాని బాధ భరించలేక మిక్కిలి వాపోతూ అటూయిటూ తిరిగి తన కృతఘ్నత్వానికి తానే హతమైపోయింది పులి. ఒక కంటికి రోగం వచ్చినప్పుడు ఆ కంటికి వైద్యం చేయించి, రెండవకంటికి రాకుండా చూసుకోవాలి. లేకపోతే ఆ కంటిగోడు ఇవతలి కంటికి కూడా తగిలి అది కూడా పోయే ప్రమాదముంది. ఆ విధంగానే పొడిచింది ఒక కన్నైనా నొప్పిని భరించలేక అటూయిటూ తిరిగి చనిపోయింది పులి.

ఇక్కడ ఓ మృగమా! అని పిట్ట పిలిచింది. ఇంతకు ముందు మృగపతీ! అని గౌరవించింది. ఆ పిలుపులో తేడా ఉంది. ఆ గౌరవం పులిరాజు పోగొట్టుకున్నాడన్నమాట.

అల్పుడేకదా! వీడు నన్ను ఏమి చేస్తాడులే అని అనుకుంటుంది లోకం. ఆ అల్పుడే తెగిస్తే ఎంత పనైనా చెయ్యగలడు అన్న సంగతి అప్పటికి తెలియదు. తర్వాత తెలిసివస్తే ఏమి లాభం! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లుంటుంది. చేసిన మేలు మరచిపోవటమన్నది దుర్మార్గుల లక్షణం. ఒక గ్లాసెడు మంచినీళ్ళు ఇచ్చిన వారినిగాని, పరస్థలంలో భోజనం పెట్టినవారినిగాని, ఆపత్సమయంలో ఆదుకున్నవారినిగాని ఆదర్శ పురుషు డెన్నడూ మరచిపోడు (ఇక్కడ పురుషుడంటే జీవుడు అని అర్థం. మగవాడు కావచ్చు, స్త్రీ కావచ్చు). తన జీవితాంతమూ గుర్తు పెట్టుకుంటాడు. తన బంధుమిత్రులతో సందర్భం వచ్చినప్పుడెల్లా ఆ విషయాన్ని ఎన్నిసార్లు గుర్తుకు తెచ్చుకుంటాడో! అదీ కృతజ్ఞత. మేలు చేసినవానికి మేలు చేయకపోగా కీడు కూడా తలపెట్టేవాళ్ళున్నారు. వారికి ప్రకృతిపట్ల ఉదాత్త బుద్ధి ఉండదు. అవతలివాడికీ ఒక సమయమంటూ వస్తే మనగతి ఏమవుతుందన్న ఆలోచన ఉండదు. వీటన్నిటిని దృష్టిలో పెట్టుకునే మనుషులకు బుద్ధి చెప్పాలనే మంచన మంచి నీతి సందేశాన్ని అందించాడు ఈ 'కృతఘ్నత' అన్న కథ ద్వారా.

# కవితా

- D.A.L.N. మూర్తి

డా॥ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి జయంతి సందర్భంలో సమర్పించిన పద్యప్రసూనాలు

ఛంధస్సుందరమైన పద్యకవితా సారస్వతం బన్నచో
డెందం బూరి సముద్రమై పొరలి గొండ్లింజేయునంచున్ మహా
నందం బొప్ప కవిత్వ మాధురుల సౌందర్యంబు శ్లాఘించి మా
కందం బాల రసాలా తేనియలో ద్రాక్షాపాకమో యిచ్చెనే.

రాజు కావ్యంబు నిరాకరింప గుణాఢ్యు
　　డగ్నిలో కృతి ప్రేల్చినట్టి గాథ
అక్షర రమ్యతన్ ఆది మహాకవి
　　భారత రచన చేపట్టు కథలు
కవి సార్వభౌముడు కనకాభిషిక్తుడై
　　పద్య సౌరభములు పంచు కథలు
గండ పెండేరంబు కవి దిగ్గజమునకు
　　రాయలు తొడుగు వరాల కథలు
తెలుగు కవిపండితుల యశోదీప్తి ప్రభలు
తెలుగు రాజుల కీర్తిప్రతిష్టలలరె
రమ్యముగ తెల్పి ఆంధ్రపురాణ రచన
సలిపె సత్యనారాయణ శాస్త్రిగారు.

ఆంధ్ర పురాణము అది పురాణము
　　కమనీయ గాథల కల్పతరువు
ఆంధ్రపురాణము అదొక చరిత్రయా
　　పులకలు గొలుపు వీరుల చరిత్ర
ఆంధ్ర పురాణము అది నీతి చంద్రికా
　　దేశ భక్తియు ప్రేమ తెలుపు గురువు
భారతము వలె సకల సంపద్విభూతి
ఒక పురాణమె యెల్లర కొసగు రీతి
సత్కవి మధునాపంతుల శాస్త్రిగారు
ఒసగి రాంధ్ర పురాణ మహోత్తమ

అసిస్టెంట్ డైరెక్టర్ జనరల్. టెలికం. (రిటైర్డ్), 8-145/1, వసంతపురి కాలనీ, మల్కాజ్‌గిరి, హైదరాబాద్ - 500047.

# స్వాతంత్ర్యం

- వేగిరెడ్డి చంద్రశేఖరరెడ్డి

సీ॥ ఎచ్చోట విజ్ఞానముచ్ఛస్థితినెసంగు
అచ్చోట స్వాతంత్ర్యమధివసించు!
ఎచ్చోట నైతిక స్వేచ్ఛలు విలసిల్లు
అచ్చోట స్వాతంత్ర్యమతిశయిల్లు !
ఎచ్చోట యువశక్తి హెచ్చి యురకలేయు
అచ్చోట స్వాతంత్ర్యమమరియుండు
ఎచ్చోట కులమత విచ్ఛిత్తియగుచుండు
అచ్చోట స్వాతంత్ర్యమలరుచుండు !

సీ॥ అట్టి జనజాగృతిప్రగతి యంకురింప
అట్టి గణతంత్ర "స్వాతంత్ర్య" మవతరింప
అట్టి నవ్యమానవ వాద మధిగమింప
ఉద్యమింపుము సోదరా ! ఉద్యమింపు!

M.A(His); M.a.(Tel); B.Ed., జి.ప.ఉ.. పాఠశాల, ఇంకొల్లు - 523167

# శ్రీ ధేనువాగీశ్వరీ స్తోత్రమ్

సంస్కృతం : *మండ జగన్నాథ పండితుడు* తెలుగు : *వేదం వి. రామస్వామి శాస్త్రి, ఘనాపాఠీ, వైయాకరణిః*

మ॥ ప్రణుతిం జేసెద వాణి! సృష్టి మొదటన్ వారాశిలో శేషశ
య్యను వెల్గొందు రమామనోహరుని నాభ్యబ్జోద్భవుండైన బ్ర
హ్మనుఁజేపట్టి జగద్వినిర్మితిని వేదావిర్భవవిస్ఫూర్తి భా
విని వై యొప్పెడు నిన్ను శుద్ధమతినై విద్యేశ్వరీ భారతీ !

మ॥ నతిసేతున్ బరిపూతరూపవిభవానందీకృతస్తోత్ర భా
క్తతి! విశ్వేశ్వరి! శుద్ధభావనిజభక్త వ్రాత జ్ఞానప్రదా !
మతిమద్వేదపథ ప్రదర్శిని ! సుధర్మ జ్ఞానవైరాగ్యమో
క్షతపోవృత్తివిధాయినీ ! మహిత బాసర్ క్షేత్ర సంవాసినీ !

ఉ॥ వీకనుదేవి! నీమకుట విస్ఫురదిందుకళా ప్రదీప్తి స
ద్ధీకరమై, సువర్ణనినదీకృతమై, పరమార్థ భావభ
ద్రాకర మస్మదీయ హృదయామలకాముని కొప్పి క్షేమమై
శ్రీకరమై భవద్వినుతిఁ, జేసితించి నుతింతు నంబరో !

మ॥ సరవత్కృచ్ఛృపి ! వాణి ! నీవు దయ వాక్శక్తిం బ్రసాదింపగా
బరగుంజీకటి; నాదుఫల్గుతరమౌవాంఛా చలత్తూలికో
త్కరముల్ క్షిప్తముచేసి, శ్రీకరభవత్సౌశీల్యడోలాచల
ద్వరఖేలాద్యుతిమౌళిచంద్రవసువిధ్వస్తాజ్ఞతం గూర్పవే !

మ॥ రవణశ్రీకర హేమరత్నవలయ త్వత్పాదపద్మద్వయ
ప్రవణుల్ నీ మహితాశిషంబుల విపాపత్వంబునుంగాంతురో
నవబాలావరరూపిణీ! అభయమున్ బ్రాపింప మార్గంబు, పా
పవిధూనత్వముగాంచహేతువగు నీ పాదాబ్జముల్ గొల్చెదన్

మ॥ పరవాగ్దేవి! త్వదీయతత్త్వమెఱుఁగం బ్రజ్ఞానమేదారి, భా
సురవేదాంతనితాంతగీత! శుభవత్సుజ్ఞానలోపంబుకుం
దురితంబేకతమౌఁగదా, జనులకెందుం, దీనిభావించి, దీ
నరవప్రస్తుతి సేతు నిన్నతుఁడనై నా పాపముల్ బాపఁగన్.

క॥ యమ నియమాది విధాయిని !
కమలాసనమానసానుగత సాహిత్యా
విమల శుభసుశ్రుతి నదీ !
సముదితతత్త్వాతుఁ ᳚ఁబ్రసాదింపుననున్

మ॥ వనజాతాసనకాంత! మండకులవిభ్రాజగన్నాథ స
జ్జనవిద్వత్కవిరా డుదీరితమునీ సంస్తావమే నీకుఁదీ
యనివౌశార్కఖండవాక్ప్రహితమై సాలంకృతింగుండలం
బనవిద్వన్ముఖకాంతిదంబగుచునత్యంతంబుశోభిల్లెడున్.



కవిత

## మహాకవీ!

- తిరునగరి MA., BOL.

వస్తువులో మానవతా
భావనకే తావిచ్చిన
భాషలోన ప్రజలు పలుకు
భాషకు పట్టంకట్టిన
మహాకవీ గురజాడా!
మాకు నీదె అడుగుజాడ
జాతిని మేల్కొల్పు నవ్య
గీతం రచియించుకొరకు
కలంపట్టి కవితలల్లి
కంఠమెత్తి విన్పించిన
మహాకవీ గురజాడా!
మాకునీదె అడుగుజాడ
తెలుసువాణి తియ్యదనం
దిశలన్నిట విన్పించగ
ముత్యాల సరాలలోన
ముద్దుకవిత రచియించిన
మహాకవీ గురజాడా!
మాకు నీదె అడుగుజాడ
తెలుగు ప్రజల గుండెలలో
దేశభక్తి, వెలిగించిన
తెలుగువారికెల్ల ఒక్క
వెలుగుదారి చూపించిన
మహాకవీ గురజాడా
మాకునీదె అడుగుజాడ

## అమృతస్పర్శ

- తిరునగరి MA., BOL

మధురమైన సంగీతం విన్నప్పుడల్లా
నువ్వు నాకు గుర్తొస్తావు
సుందరమైన వసంతాన్ని చూచినప్పుడల్లా
నువ్వు నాతలపుల్లో మెదలుతావు
చిటపట చినుకులు కురిసినప్పుడల్లా
మనం చెట్టాపట్టాలు పట్టుకొని
వానలో తడుస్తూ నవ్వుకున్న
ఆ రోజులు స్మృతిలో మెదలుతాయి
వజవజవణకించే చలికాలం వచ్చినప్పుడల్లా
మనం గాఢాశ్లేషంలో మైమరచిన క్షణాలు
కళ్ళల్లో కదలుతాయి
ఇవాళ నువ్వెక్కడున్నావో కానీ
నీ అమృతస్పర్శ ఇంకా
నా గుండెని తాకుతూనే వుంది
రేడియోలో నీలిమేఘాలలో, పాట వచ్చినప్పుడల్లా
నీ రూపం నాకళ్ళల్లో సాక్షాత్కరిస్తూనే వుంది
పూచిన గులాబీని చూచినప్పుడల్లా
అది నీసిగలో నవ్వుతున్నట్లుగానే వుంటుంది
తీయని కోయిల పాటను విన్నప్పుడల్లా
అది నీ తేనెపాటను తలపింపజేస్తూనే వుంటుంది
నువ్వెక్కడున్నావో కానీ
నీ అమృతస్పర్శ నా గుండెని తాకుతూనే వుంది

కవితా సదనం, పోచమ్మవాడ, ఆలేరు - 508 101. నల్లగొండ జిల్లా.

# అతడు - ఆమె

డైరీలో ఖాళీగా మిగిలిపోయిన కాగితాలు
స్పష్టత పేరుకుపోయిన జీవితానికి ప్రతీకలు

ఎప్పుడో నిశిరాత్రి చీకట్లో
ఒక నక్షత్రం రాలిపడుతుంది
ఎక్కడో ఒంటరి పిట్టొకటి
అరుచుకుంటూ వెళ్ళిపోతుంది
గుడివాకిట్లో తూలిపడిన యేటి అలొకటి
మంద్రంగా విరిగిపడుతుంది.
అప్పుడు
గుండెల్లో ఏదో తెలియని అలజడి పుడుతుంది.
గతాన్ని నెమరు వేసుకుంటూ
నిస్సత్తువగా మనసు మంచాన పడుతుంది.
అయినా
ఎద గవాక్షాల మీద చిందిపడే
తడి చినుకుల చిరుచప్పుళ్ళతో
గుండె వాకిళ్ళు తెరుచుకుంటాయన్నది
వట్టి భ్రమ మాత్రమేననీ,
ఎండి బీటలువారిన గుండెల్లో నిండిన ఊపిరి
బురుజులు లేని కోటలో
రెపరెపలాడే దీపం వంటిదనీ తెలిసి
నిలువునా కూలిపోయిన జీవన లత
వుండి వుండి చివురిస్తూనే వుంటోంది.
ఆడదాని జీవితానికి ఆ పూల తీవెకు
ఎంతో పొంతన వుందంటూ
ఎప్పటికప్పుడు మమత-మనువులకు
సరికొత్త భాష్యాలు చెప్పే అతడి మేధకు
ఆమె గుండెల వ్యథ మాత్రం అంతు బట్టలేదంటే
లోపం ఆ గుండెదా?
ఈ జీవన సరళిదా ?!
ఎంతకూ తరగని కాళ రాత్రిలో
కాలంతో పాటు బందీ అయిన అనుభూతి....
మల్లెపూలూ మామిడి చివుళ్ళూ
మసక మసక వెన్నెల్లో కలిసికట్టుగా
గుండెల్లో మంటలను ఎగదోస్తుంటే
అతడి జ్ఞాపకాలు ఆమెకు మిగిల్చిందేమిటి -
తీరని వెతలు శతకోటి నిట్టూర్పులూ తప్ప !
తుడిచే చేయి వుంటేనే
కన్నీరు కంటికి అందం అని తెలిసి
మలుపు మలుపుకు ఎదురయ్యే
తర్షితానుభూతుల మృతదేహాలను దాటాలని
ఆమె సాగించే ఒంటరి పోరాటం
తేనె పూసిన అతడి అనురాగపు గుళికలకా
అన్న సందేహం
ఆమె అభిమానపు గుండెల్లో విచ్చుకత్తులు నాటినా,
ప్రతి ఉషస్సులో - లేత ఎండ వెలుగులో
వింతగా మెరిసే సాలెగూడులాంటి విషవలయంలో
చిక్కుకు పోయానన్న తలంపు మనసును కలవరపరచినా
లేని ఆ అనుబంధాన్ని
తెంచుకుపోలేని ఆమె అశక్తత
అతడికి వేడుకగా మారింది
ఆమెను వెక్కిరిస్తోంది !

---

'విను', 94 సౌత్ వెస్ట్ బోగ్ రోడ్, టి. నగర్, మద్రాసు - 17.

## బతుకులోంచి పుట్టిన ఊటలు
# బతుకు పాటలు

- 'రసన'

పాట జీవితంలోంచి పుడుతుంది - జీవితంలోని అనుభవంలోంచి పుడుతుంది. పాట స్వప్నంలోంచి పుడుతుంది-స్వప్నంలోని భవిష్యద్దర్శనంలోంచి పుడుతుంది. పాట ప్రేమలోంచి పుడుతుంది - ప్రేమలోని రసానందంలొంచి పుడుతుంది పాట ఈటెకంటే పదునైనది వెన్నకన్న మృధువైనది.పాట పూవులాగా పరిమళిస్తూ, తావిలాగా అలుముకుంటుంది పాట సొదల్ని వినిపిస్తూనే, అనుభూతుల్ని పంచిపెడుతుంది పాట హృదయ తంత్రుల్ని మీటుతూ, మనోస్తరాలలో ముద్రవేస్తుంది పాట గుండె నుండి గుండెకు నేరుగా ప్రసారమయ్యే భావ పరంపర. ఈ మాటలు గమ్మత్తుకోసం వ్రాస్తున్నవి కాదు, సుద్దాల అశోక్ బతుకు పాటల సంపుటి చదివిన తరువాత తెలుసుకున్న మహత్తు

వచన కవిత్వ సంపుటులతో పోలిస్తే అచ్చవుతున్న పాటల పుస్తకాల సంఖ్య స్వల్పం. అందులో అధికశాతం అనుశ్రుత జానపద గీతాలో, ఉద్యమాల నేపథ్యంలో పుట్టిన పాటల సంకలనాలో, రాజకీయ పక్షాల ప్రచార గేయాలో అయి వుంటాయి. అయితే ఇవి వాటన్నిటికీ భిన్నంగా అభ్యుదయ, మానవీయ, ప్రేమ రసైక మూర్తియైన కవి హృదయం ద్రవించి స్రవించిన పాటల ఊటలు ఈ కవి సుస్వర గాయకుడైనందువల్ల (చూ. ఆలాపన) పద్యం బదులు అలవోకగా గళం పలికింది. అతని హృదయాన్ని స్పందింపజేసిన ప్రతి వాస్తవాంశం ఒక పాటగా రూపుదిద్దుకొంది. కవి భావ భాస్వర జ్వాలలలో ఎన్నో ఋతాలు పునీతమైనవి.

ఆదిగానం సామవేదమే అనుకునే వేదాంతులకు 'పాట పుట్టిన పాట'లో 'ఆకలి మంటల బాటలో, ఆకలి తీరే వేటలో అలమట చిందే ఊపిరి అలసటయే మొదటి పాట' అంటూ తన సిద్ధాంతాన్ని వినిపిస్తాడు. టపటపటప చెమట బొట్లు తాళాలై పడుతుంటె - కరిగి కండరాల నరాలే - స్వరాలు కడుతుంటె - పాటా పనితో, పాటే పుట్టింది. సుందర శ్రమ జీవమందలి సుస్వర గమనానికి - పరవశించి శ్రమగతిలో - ప్రకృతి శృతిగ అవుతుంటే - ఉల్లము ఝల్లని [illegible] మారితె - పల్లెవాళ్ళ గుండెనుండి -పల్లవి పల్లకి [illegible] చేతిలో పనిముట్లే - ఝణం ఝణిత [illegible] తడబడు అడుగులు తజలాలై ధ్వనిస్తాయని చెపుతాడు పల్లెవాళ్ళ గుండెనుండి పల్లవి పల్లకి సాగుతున్నప్పుడు జానపదులు జ్ఞానవిధులు అనిపించక మానదు కవి శ్రమ విలవను, గొప్పతనాన్ని, తెలియజెప్పుతూ 'పుడమియంత శ్రమయాగపు వేదికరా నిజానికి. పనిపాటల సోదరులే పునాదు లీ భువనానికి' అంటాడు.

అశోక్ పాలమనసు కలవాడు కనుకనే నాదేశం పూల కడలి, నా హృదయం పాలకడలి, నా వాదం, నా వేదం 'విశ్వమానవీయ పథం' అని స్వచ్ఛంగా స్పష్టంగా చెప్పుకున్నాడు. విశ్వ మానవీయ పథాన్ని ఆశించిన వాడు కాబట్టి 'నానీ కులాలు మాసి/పోనీ గతాల నాటి పాతరకం పాడుమతం పాశవికత పోని.... రానీ జగాల నిండ ఒకే మతం మానవత్వ మొకే కులం మనిషి కులం అని ఆకాంక్షిస్తాడు. అందుకోసం చిరు వెలుగులు చిమ్మే చేతనస్ఫూర్తి [illegible] మానవతా స్పందనకై ఏవో వెతుకుతూంటాడు. తమ్మీ లెవ్వురా నిద్దుర తన్నీ లెవ్వురా అంటూ వైతాళికుడై జడత్వంలో నిద్రించే యువ జనాన్ని మేల్కొలుపుతాడు ఎదురయ్యే కష్టాల మూలంగా

పాలకుర్తి - 506 252, వరంగల్ జిల్లా.

'హృదయం బాధలో ఉన్నప్పుడే నవ్వాలి, శోకమే మిగిలినా లోకములో సాగాలి; అప్పుడే నీవొక మనిషివి, అప్పుడే నీవొక సాహసివి' అని ధీరోదాత్తతను ప్రబోధిస్తూనే, 'కళ్ళుమూసి నువ్వు బతకరాదు, మళ్ళ; ఒళ్ళు విరిచి జూలు దులిపి నర్సింగమై లేవాలని ఉత్తేజ పరుస్తాడు. 'అప్పుడే కావడి దించే గడియ ఒస్తది - కష్టము తొలిగే కాలమొస్త' దని ఆశ్వాసన అందిస్తాడు.

అయినప్పటికీ 'పాట నా ప్రాణం పాట ధ్యానం ఒతుకు గాయాలను తెలుపు నా గానమని' ఎటువంటి అభిజాత్యం లేకుండా చెప్పుకొని, యౌవనంలోని బాధ్యతలకు, కష్టాలకు సొలసిపోయి, చీకు చింతా లేని బాల్యాన్ని నెమరవేసుకుంటూ 'ఏవా నవ్వులు, లేవా సుఖాలు' అని వాపోతాడు. కేవలం తన విషయంలోనే కాదు, ఎదుటివాని బాధను సైతం తన భావనలో తాదాత్మ్యం చెందించుకొనా పాటకట్టుతా దీకవి. 'కన్నతల్లి మమ్ముల కన్నప్పటినుండి కడుపునిండ తినలేదు మెతుకు, కంటినిండ కనలేదు కునుకు.... తల్లికడుపుల ఉన్న ఆ తొమ్మిది నెళ్ళు ఆకలి దప్పులూ తెలువవు మాకు' - తల్లి కడుపులో ఉన్నప్పుడు తప్ప భూమిమీద పడ్డ క్షణం నుంచీ సుఖం ఎరుగని ఓ అభాగ్యుని హృదయ రోదనను ఎలా పలికించాడో పై పాటలో చూడవచ్చు.

ళ్ళొళ్ళొళ్ళహాయి అని డోలలో ఊపుతూ జోలలు పాడే తల్లి స్త్రీ, భార్యగా జోడుండేది వేరొక స్త్రీయే! 'ఆమె నీమేని సగపాలు - నీకు ఆత్మీయురాలు - ఆపదలో పోరాడే సహ సైనికురాలై సైదోడుగా ఉంటుంది. కాని ఆ స్త్రీకి ఇక్కడ పురుషాధిక్య ప్రపంచంలో ఏ మగవాడూ సరియైన ఆదరణ ఇవ్వటం లేదు. ఈ విషయాన్ని 'ఆడదాన్నిరో నేను ఏడిదాన్నిరో ఈడ ఎవరికి కానిదాన్నిరో' అనే పాటలో స్త్రీహృదయ ఘోషను ఆర్ద్రంగా తెలియజేస్తాడు. వాత్సల్యంతో పెంచి పెద్ద చేస్తే వృద్ధాప్యంలో కనీస కృతజ్ఞత చూపని సంతానాన్ని తలచుకుంటూ -

ఉక్కుంగా ఉక్కుంగా అన్నప్పుడు
చక్కెర పానకము నాలుకపై పడినట్టు
త్తత్తత్త అని నువు మెత్తగ నవ్వినప్పుడు
కోటి చందమామలొకటొకటే ఎదకొచ్చినట్టు
చిన్నా నీ మాటలెంత తీయన
కన్నా నీ మోమంత కన్నా చక్కన..

ముడుతలు పడి అరవై ఒడిలో నే తడబడినప్పుడు
తల్లికాదు నాకిది రోగిష్టి ముసలిదని
నన్ను వెళ్ళు కళ్ళ పడకుమని
తన్ని కసరుకున్నప్పుడు
చిన్నా నీ మాటలలో తాచుపాములు
కన్నా నీ మౌనమున పిశాచి నిద్రలు

అని కుమిలే ముసలితల్లి పాట పొరలు కమ్మిన వారి కళ్ళను తెరిపిస్తుంది. ఈ బతుకు పాటలను అశోక్ ఓ పల్లెటూరి వేదికపై వినిపించిన సందర్భంలో జరిగిన ఒక సంఘటనను తన ఆలాపన (ముందుమాట)లో పొందుపరిచినాడు. "ఎట్ల గట్టినవు బాపూ! బతుకు పాట యిన్నంత సేపూ కండ్ల పొంటి నీళ్ళు, పెయిపొంటి ముండ్లు వచ్చినయి. ఏ సల్లని తల్లి కన్నదో గాని సల్లంగ బత్కు' మని ఓ పండు ముదుసలి వేదిక దగ్గరికి వచ్చి వేళ్ళతో పుణికి అన్న ఈ మాటలకంటే మిక్కిలి కవికి వేరే ఏ సర్టిఫికేట్ అక్కరలేదు.

ఈ కవికి ప్రకృతి పట్ల అమితానురాగం ఉంది. ప్రకృతియే చేతనాకృతి నందిన కళా స్వరూపమని భావిస్తాడు - కడుపులోన దాచుకున్న సకల కళలకూడలి; అదే ప్రకృతి. అదే అదే విశ్వానికి చేతనాకృతి. లలిత కళల గీతుల ప్రతులే చలియించే ఋతువులగతులు ప్రకృతే కళలకు మాతయని ప్రగతికి కళలే జ్యోతులని తెలియజెప్పుతాడు. అణువణువున ప్రకృతినిండ కనరాని బంధాన్ని చూపుతాడు. 'ధరణితల్లి ఆకుపచ్చ చీర చిరుగుతున్నదని డొక్కలోన

ఉక్కుడేగ రెక్క విసురుతున్నదని' విచక్షణా రహితంగా జరుగుతున్న పారిశ్రామికీకరణకు బాధపడుతాడు. చెట్లను కాపాడుకోకపోతే ఆ శాపం మానవాళి సమస్తం అనుభవించవలసివస్తుందని ఒక పాటలో హెచ్చరిస్తాడు పాలికాపులై మీరుంటే పూలపళ్ళ నివాళి మీకే. పరశురాములై మీరొస్తే ప్రపంచాన మిగులు ఇసుకె అని సహజ ప్రకృతి పట్ల మానవుని బాధ్యతలను గుర్తు చేస్తాడు తన పాటల్లో

పల్లవాలు శ్రుతి చేయగ
పరిమళాలు పల్లవిగా
ఆకు ఆకు చిటికె వేయ
రేకుల వాకిలి సాగే
పూలపాట విన్నావా
పూల తోట నీవు

పాట చదివినప్పుడు కృష్ణశాస్త్రిగారి ఆకులో ఆకునై అన్న లలిత గేయం గుర్తుకు రాక మానదు కవిలో భావుకత్వం పుష్కలంగా తొణికిసలాడుతుంది. మరికొన్ని మచ్చుతునకలు చూడండి - రాతిరమ్మసిగలోన వెన్నెల పువ్వుపూసె విరివెన్నెల పరిమళాన జగమంతా తడిసె కలువ చెలువ కపోలాన తళుకు లెవడు పోసె / రాలతోన రాలు మల్లె మేను కమిలె! / వెన్నెలమ్మ పాలనలో వివిధ గతులు చూసి / కళ్ళు మూత పడని కవి కలము పాట రాసె! కలువ చెలువ తళుకులతో పాటు రాలుపూల కమిలిన మేనును కూడా దర్శించే దయాహృదయుడు! ప్రణయ భావన పలికించటంలోనూ, విరహ వేదన వినిపించటంలోనూ దిట్ట! మేఘమాలా! వేగమేలా/వినవటే నారాగమాలా/ నెమలి పిలిచె - అడవి పిలిచె/నెనరు లేదా వగల జాణా/ రాగధారల తీగలున్నా/జాగదేల? మూగవీణా/కునుకు లేదే కుర్రదానా! కురిసి పో పన్నీటి వానా!

ఒక్కోసారి గుండె బరువెక్కినప్పుడు 'స్పందనా రహితమగు తంత్రులను స్పృశియింప - ఏలనో నీ వ్రేలి కొసల కీ తొందర - నిర్వేదనా గీతికా ప్రియతమా - నీకంత కమనీయమా అంటూ తనన నిర్వేదాన్ని చెలికి నివేదించు కుంటాడు

అశోక్‌కు దేహం నిండా దేశభక్తి ఉంది. దేశభక్తుల యెడ ఆరాధన ఉంది. జైజైజై - జై దేశమునకై - ప్రాణముల నైవేద్యమిడినట్టి యోధులకు అని వారికి జయగీతం పాడుతూనే, 'జండా చలిస్తుంది - మన జెండా జ్వలిస్తుంది జండా ఉంఛా రహే హమారా అని గూండాలే అంటుంటే ప్రజాస్వామ్యమిదేనా ప్రజారాజ్యమిదేనా' అంటూ వేరొక పాటలో యోధుల త్యాగఫలం విఫలమవుతున్న తీరుకు విచలితుడైపోతాడు. మబ్బులనే పిడికిళ్ళుగ ముడిచిందీ ఆకాశం తడలే నా పిడికిళ్ళని కదలి చేయునాక్రోశం ఓ మదీయ భారతీయ ఏదీ నీ ఆవేశం అని భారతీయుల నరాల్లోకి పౌరుషాన్ని ఎక్కించె ప్రయత్నం చేస్తాడు

ఏబది ఏడు పాటలున్న ఈ పుస్తకంలో ఎనిమిది పాటలు కవులు. దేశభక్తుల స్మృతికి రాసినవి. శ్రీశ్రీ గురించి రాస్తూ 'విచ్చు కత్తుల వంటి యువకుల బిగిసికొను పిడికిళ్ళ యందున బిగువుతానై నిలిచి ఎగసే' వాడని చెప్పుతాడు. అగ్ని తరంగమైన అనన్య దేశభక్తుడు భగత్‌ను 'భారతమాతను చెరవిడిపించగ భగ్గున మండిన జ్వాలాశృంగం' అనీ, అంబేద్కర్ గుర్చించి 'దళిత జాతి జనుల కనుల గంగాధరుడు - పీడిత హృదయముల వేదనాగ్ని నేత్రుడు - బాధల గరళాల కంఠమున దాచిన హరుడు - పేదలకే బతుకందించిన కరుణా కరుడు - అంబేద్కరుడు మానవతా భాస్కరుడు' అని కీర్తిస్తాడు ఏ వేదన మేదినిపై నిర్వేదన పరచినది ఏ మనస్సు చైత్రానికి ఆమనిగా ఒదిగినది.... చరణం రసైక భావ/శిఖరానికి సోపానం/ వ్రాసిన ప్రతిగేయం మధు/రసాల మాగాణం అని కృష్ణశాస్త్రి కవిత్వాన్ని మనకు మరోసారి రుచి చూపిస్తాడు. అడుగడుగున ముత్యాల సరాల తోరణాలు కట్టిన. పాతయుగం మూర్ఖుల పాలిట కృపాణాలెత్తిన గురజాడను స్మరిస్తాడు. అబలల కన్నీరుకు నోరందించిన చెలానికి

కైమోడ్పులందిస్తూ... హృదయ ప్రేమలను వర్ణనలో తెలుపుతూ త్యాగానికి, సహనానికి తరగతి గనులై నిలిచిన వనితల మహాకథలు రాసిన అమర కథాకథన శిల్పాచార్యుడు శరత్‌కు నమోవాకాలర్పిస్తాడు ఈ సంపుటిలోని చివరి పాట తనకన్న తండ్రి ప్రజా కవి సుద్దాల హన్మంతు కోసం ఆయన క్యాన్సర్ వ్యాధి కోరల్లో చిక్కుకొని ఇంకో రెండు మాసాల్లో చనిపోతాడని తెలిసిప్పుడు రాసి పాడి వినిపించినది (చూ:ఆలాపన). 'పల్లెటూరీ పిల్లగానీ పాల గుండే నిమిరి/కూలివాని కళ్ళలోనే నీ జాలి గాధ చదివీ' పాటలు కట్టిన హన్మంతును మృత్యువు ఏమి చేయలేదని సింధూరములో అరుణిమ-చెదరిపోని వరకు కవిగా నీవుంటావు - కనిపించని కంఠాలలో - కళవై వెలిగే నీవు' అని ఒకరికొకరు ఓదార్చుకుంటారు

బాధలెన్నున్నా, భవిష్యదాశయానికై పరిక్రమించే అశోక్ 'ఉషనందే ఆశయాన్ని - నిశలున్నా వదలుకోను - గోరంత ధైర్య దీపం - కొండంత వెలుగు నాకు' అంటూ ముందుకేగుతాడు.

కవిత్వం నిష్ప్రయాసగా తోచింది రాసే ఆశామాషీ వ్యవహారం కాదని 'కవి - పదం పదం ప్రసవ వేదనం - మేధస్సాగర మధనం - కవోష్ణ భాష్ప సంకలనం' అనీ అంటాడు. అంతేకాదు 'కవితా హృదయం విశ్వావరణం - అవిశ్రాంత శ్రమాశ్రమాంతరాన భావ కదనం - అనలపు వంతెనపైననే తన పయనం' అంటూ కవి పరిధినీ, పథాన్నీ, పధకాన్నీ తెలియపరుస్తాడు.

పద్యాన్నో, వచన కవితనో తప్ప నాటను కవిత్వంగా అంగీకరించే సంస్కారం ఇప్పటికీ సాహిత్య విమర్శకుల్లో లేదు కాని, ఈ సంపుటి చూసిన తర్వాత పాట కూడా సిసలైన కవిత్వమేనని ఒప్పుకోక ఎవరికైనా తప్పదు. అభ్యుదయ కవిత్వాన్నీ, భావ కవిత్వాన్నీ సమపాళ్ళలో మేళవించిన గానమేళా ఈ బతుకు పాటలు పుస్తకం చదివిన పిమ్మట సుద్దాల అశోక్ అభినవ తిలక్ అనిపించింది పదునూ, మృదువూ ఉన్న ఈ పాటలను శబ్ద గ్రహణం చేయించి క్యాసెట్లు విడుదల చేయించినట్లయితే మరింత ప్రయోజనకరంగా ఉండగలవనటంలో సందేహం లేదు.



**బతుకు పాటలు**

రచయిత : సుద్దాల అశోక్

ప్రచురణ : వెలుగు కళావేదిక, మేడిపల్లి పడమర, కరీంనగర్ జిల్లా,

ప్రతులకు : రచయిత, ఇం.నెం. 1-4-541, ప్రియదర్శిని కాలనీ, మెటుపల్లి - 505 325.

పుటలు : Vii + 108 వెల : రూ 20-00

# జానపదగేయ సాహిత్యంలో - సీత - ఒక పరిశీలన

- బండ రెడ్డి

జానపద గేయ సాహిత్యమునందు కూడా మన శిష్ట సాహిత్యమందున్న ప్రసిద్ధ పౌరాణిక, ఇతిహాస, భాగవత గాథలన్నియు కలవు. పౌరాణిక, ఇతిహాస గాథలపై మన ప్రజానీకమునకున్న భక్తి చెప్పరానిది శిష్టుల రచనలు పండితులకు పరమార్థమును సాధించిచూపగా, జానపదగేయములలో జ్ఞానామృతమునే పామరులకు వారికి తెలియునట్టి భాషలో, వారి చిత్తవృత్తుల కనుకూలముగా సుంతు అట్లందించినవి. వారివారి చిత్తవృత్తుల ననుసరించి ఆయా కథలందు వింతవింత మార్పులు కలిగినవి. కూర్పులు కుదింపులైనవి. మార్పులు, కూర్పులెట్లున్నను ఈ గేయములే మన జాతీయతను నిలిపినవి.

మన జానపదీయ సాహిత్యమందు రామాయణ వైశిష్ట్యాన్ని రామాయణంలోని పాత్రల విశిష్టతను చిత్రించి, ప్రశంసించి, ఆరాధించి స్తుతించిన సందర్భాలు కోకొల్లలు. భారతీయులకు ఇష్టదైవము శ్రీరాముడు. ఇష్టదేవత సీత. వీరిని భారతీయులు ఆదర్శదంపతులుగా బావిస్తారు. తక్కిన దైవతములకన్న సీతారామచంద్రులకే భారతీయుల హృదయములర్పితములైనవి. ఆదికవి తన కరుణార్ద్ర హృదయంనుండి వెడలిన శోకశ్లోకములను కుశలవులచే గానం చేయించినాడు అది విన్న సంస్కారులు, సంస్కృతాది భాషలలో, వ్రాసికొనిరి. కాని తెలుగు జానపదులు స్వయంగా, సీతారామచంద్రులనే చూచినట్లున్నారు. ఆ దంపతులు విహరించిన పర్వతములు, వనములు, పర్ణశాల మొ॥నవి తమ హృదయాలకు సూటిగా చెప్పిన కథలు తమకు తోచిన రీతిగా మలచుకొన్నా రీ జానపదులు. నాటినుండి నేటి వరకు జానపదులప్పుడప్పుడు పాడుకోగా విన్న చరిత్రము కొంతకు కొంత మాత్రమె భాస్కరుడు పదరకున్న బండ్ల కెక్కింతుననుకొన్న పోతన్న కర్థమైనది. పోతన్న పరిదేవనము కంచెర్ల గోపన్నకవగతమైనది. అందుకే సీతమ్మకు చింతాకు పతకము దొరికినది. ఆ పతకమున శ్రీరామచంద్రుని తొమ్మిదికోట్ల ప్రతిబింబములు త్యాగయ్యకు కనబడినవి. తెలుగు జానపదుల పందిరి కల్లుకున్న రామయణ లత ఆద్యంతములు లేవు భాస్కర, రంగనాథులకు తెలియని విశేషములు తెలుగు జానపదు లకు తెలియును.

ఒక్క సీతాదేవిని గూర్చి జానపదగేయసాహిత్యమున పేర్కొన్న సందర్భాలు కోకొల్లలు అందులో ముఖ్యమైన వాటిని కొన్నింటిని పరిశీలిద్దాము.

1. సీతాకళ్యాణము పాట :- సీతాకళ్యాణము పాటనెవరు వ్రాసిరో తెలియదు. జనకునింట సీతమ్మ ఆడుచూ, పాడుచూ, నొకనా డటనున్న శివధనువు నెత్తెను. అది చూచిన జనకుడు శివధనువునెత్తిన బెడువారికే కూతును నిత్తునని చాటించెను. తక్కిన కథయును సాధారణమైనదే. ఈ దేరిన సీతమ్మను ఇటుల వర్ణింపనైనది.

"పండు వెన్నెల మించు యాపణతి మోము,
గండుమీనుల బోలు కలికి కన్నులవి
తోరంపు బొమ్మలది తోయజగంధి,
కీరపలుకుల బాల కువలాయతాక్షి
తిల పుష్పములు బోలు తీరునాసికము
తళుకు టద్దము మించు తరుణి చెక్కిళ్ళు
పగడంపు చాయల పణితి పెదవులవి
తగుముత్యముల బోలు మరునిదంతముల

M.A. (Tel ), M.Ed, (M.Phil)రూమ్ నెం. 32, సి-హాస్టల్, ఉస్మానియా యూనివర్సిటీ కేంపస్, హైదరాబాద్ - 7.

కనుపు శంఖముబోలు నళినాక్షిగళము,
తో... యూతోయజగంధి
అరటి బోదెల మించు అతివ పెందొడలు,
కరిదంతములు బోలు కలికి పిక్కలది
మదగజ గమనంబు మగువ నడకలది,
కొదమ తాబేల్వంటి కుచుడు నడకలది"

ఈ వర్ణనము ప్రబంధ మార్గమునకు దగ్గరగా స్త్రీల పిక్కలను సాధారణంగా పంపొట్లలతో బోల్చుట నాడుక కాని గీతిలో ఏనుగు దంతములతో పోల్చుట జరిగినది. క్రొత్త యుపమానము.

2. సీతాదేవి యానవాలు:- 'సీతాదేవి యానవాళ్ళ'ను పాట చాలా మనోహరమైనది. సీతాన్వేషణమునకు బయలుదేరు హనుమంతుడు శ్రీరామచంద్రుని తాను సీత నెఱు యానవాలు పట్టవలెనో చెప్పుమని యడిగెను. శ్రీరాముడు సీతాదేవి యందచందములను కొన్నింటిని చెప్పెను. అటులనే దాంపత్యజీవితమున గడిచిన కొన్ని మధుర సన్నివేశములను కూడ చెప్పెను. ఇవి అన్నియు కలిసి సీతాదేవి యానవాళ్ళను పాటయయ్యెను. దీనిలో శ్రీరామచంద్రుడు సీతాదేవి సౌందర్యమును వర్ణించి చెప్పిన ఘట్టము జానపదవాఙ్మయమునకే కాదు సకల ప్రపంచ శిష్ట వాఙ్మయమునకు తలమానికము ఇందుల లంచ్చవైనట్టి అంగాంగ వర్ణనముగాని, బాహిర సౌందర్యముగాని అవేలముగా వర్ణింపబడలేదు. సీతమ్మ ..అంటు ఆడకె ఆడినట్లుండు, పచ్చిపసు అలదకే అలదినటులుండు, పెట్టకకాటుక పెట్టినట్లుండు, దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు. అలదక పరిమళము లందినట్లుండు, మసిపోత గట్టిన మాణిక్యంవలెను, శీతాకాలమునాటి ఉదకమ్మువలెను, పాడ్యమి జదివిన ..మ్మువలెను," ఉండునని జానపదులు తమ గీతములలో వర్ణించినారు.

అత్రిమహాశ్రమమున అనసూయ సీతమ్మకు కానుకగా "పాయనిశృంగారం మానిమడత, కందినీ భూషణములు కాంత తానిచ్చి" న సంగతి కూడ ఒక ఆనవాలుగా చెప్పెను.

3. కోవెల రాయబారముపాట: 'కోవెల రాయబారము'ను పాటలో లంకయందు అశోకవనమునయున్న సీత ఒక వెన్నెల రాత్రి శ్రీరామవిరహమున తపించుచు కోయిలతో శ్రీరామునికి తన దీనావస్థనెరిగించి తోడితెమ్మని బ్రతిమాలు గాధకలదు.

"మెడది హారంబిస్తు కోవెలారో
ప్రాణేశు దోడ్తెమ్ము కోవెలారో
పక్షి జేసిన పనులుకో వెలారో
ఉపకాములు ఉండు కోవెలారో" యని బతిమాలును.

4. సీతమ్మ అగ్నిప్రవేశము:- 'సీతమ్మ అగ్ని ప్రవేశము' పాటలో మారీచుడు మాయ మృగమై వచ్చుటనుండి శ్రీరామ పట్టాభిషేకము వరకుగల గాథ వర్ణించబడినది రావణవధానంతరము రాముడు లక్ష్మణునితో "కుక్క ముట్టిన కుండ కొరగాదు సుమ్మి" యని సీతమ్మను విడిచియే అయోధ్యకు పయనమయ్యెను. సీతమ్మ "భూదేవి పుత్రికను శ్రీరాము సతినంచు" ఆనలుపెట్టి ..మునాడు ..డతిగాగొని యిట్లు బలుకంగ దగున, పక్షులలోన యినవృక్షములనైన, పశు మృగంబులనైన పుట్టలేనైతి తప్పున్న శిక్షింప ధాతవేనీవు" అని బ్రతిమాలెను. సీత అగ్ని ప్రవేశమొనర్చినను రాముడు స్త్రీలు "అగ్ని మంత్రంబున అగ్ని బట్టేరు, వేడివస్తువులెల్ల పట్టిచూచేరు' అని సీతమ్మను నమ్మడు. దేవతలు ప్రత్యక్షమై సీత నిర్దోషియని చెప్పిరి. జానపదులకు ఇట్టి అద్భుత విషయము లందు అభిమానము హెచ్చు.

5. సీత నత్తవారింటికి పంపుట:- 'సీతనత్తవారింటికి పంపుట' యనుపాటలో జనకుడు సీతమ్మకు గరపిన బుద్ధులు గమనింపుడు.

''నెలతరో కన్న కూతురువు గనుక నేనొక బుద్దెరిగిస్తు వినుమా నాథుని ముంగిట నెన్నడు పక పకనవ్వకుమీ సుందరి నాథునికన్నా ముందర మేల్కొనుమీ పలుకకు నిందించకుమీ కలనైనా పంకజాక్షి సీతా బెలువుడు ప్రాణేశ్వరుడూ పిలువక శాయబోకుమీ పనులు పిలిచిన వేళనె పలుక -ుండుమీ కలకంఠిరో నీవు అత్తమామకు జనులకు భక్తిగ సేవలు సేయుమీ హెచ్చుగ వదినెమరదళ్ళలో మెచ్చుగ దిరగకుమీ ఆశగ పిలిచినవార్ని యెప్పుడు ఆశలెరిగికాపాడూ నీ సరివార్ని హాస్యము శాయకు''మని జనకుడు బోధించినది మనకు వర్తించును

6. సీత సమర్తపాటః- 'సీత సమర్త'యనుపాటలో సీత సమర్తయైన వార్త నామె చెలులు కౌసల్యకందించగనే యామె వచ్చి సీతమ్మను చీరచూపుమని యడుగను. 'సీత అత్తడిగిన భయమునకు బిత్తర చిరునవ్వుల ముద్దియ శిరగటు వంచుక చీరటు చూపినది' నయము, భయము సిగ్గు, మూర్తిభవించిన కోడండ్ర పరిస్థితి, ప్రేమ, అధికారము, ఆదరముగల యత్తలసన్నిధి ఇప్పటికిని మన యిండ్లయందీ విధముగనే యుండును. సీత సమర్తకాలమున జరిగిన అచ్చట, ముచ్చటన్నియు మనిండ్లలో జరుగునట్టివే.

7. సీత గడియపాటః- 'సీతగడియ' యను పాట మనోజ్ఞమగు జానపదగేయము. ఇంట్లో పనులన్నియు ముగించుకొని, 'అత్తకౌసల్యకు అడుగులు వత్తి మామ దశరథులకు మడతలందిచ్చి సుమిత్రకైకకు సురటీలు వేసి, తానలంకరించుకొని, పండ్లు పలహారములు పళ్ళెమందుంచి బంగారు కలశముతో ఉదకంబు పట్టి శయ్యాగృహము చేరుకొన్నునప్పటి కర్ధరాత్రమైనది. క్రొత్తకాపురముగదా! రాముడెంత సేపు ఓపికతోనుండ గలడు! చూచిచూచి విసిగి రాముడు కోపముతో శయ్యాగృహము తలుపుగడియ వేసెను. సీతమ్మ వచ్చి ఎంత బతిమాలినను రాముడు తలుపు తీయడయ్యెను. నిలుచుండ పాదాలు చేతులు తానొచ్చె దంతపు తలుపులూ తీయబోయి నాథవొంటొంటి చినుకుకే వొకచెంగుదడిసె కాముడా తియవోయి కనకంపు గడియ పటపటా చినుకుకు పైకొంగుదడిసె పచ్చల బాలుడా తీయవోయి గడియ అని సీతమ్మ బతిమాలుకొనగా రాముడు మరింత బిగిసి

'నిద్రనీకు లేకుంటె నాకేమిసీత - గంటవలె దీపంబు అది నాకు తోడు

నీవు నిలుచుంటేను నాకేమిసీత - పువ్వులు బుక్కోయ అవినాకు తోడు

నీవునిలుచుంటేను నాకేమి సీత - పట్టెమంచము పరపు అది నాకు తోడు'

అని బదులు పలికెను. చివరకు కౌసల్యవచ్చి రాముని మందలించి తలుపు తీయించినది.

8. సీతమ్మ వారి వసంత మనుపాటః- 'సీతమ్మ వారి వసంత' మనుపాటలో కొడుకు కోడండ్ర సుఖమును కన్నులారా జూడగోరు పితృహృదయము మనకు కన్ను గట్టును. సీతారాములు వసంత మాడినది దశరథుడు చూడడు. ఆ వార్తవిన్న దశరథుడు ''వేడుక జూచుటకు నేనోచనైతి పాపి నేత్రములు పరమాత్ముడిచ్చెనని' పరితాపమును, వేదనను అనుభవించి, తానా వేడుకలు చూడదలిచి మరల వసంతము లాడునట్లేర్పాట్లు గావించును. ఈ సీతారాముల వినోదము కూడ మన జీవితమందలి యొక మధురానుభూతియే.

ఇంతే కాకుండా సీతమ్మ వారి గురించి తెలుగు జానపదుల, జానపద గేయ సాహిత్యములో సీతమ్మవారి అలుక, సీతమ్మచెర, మొదలగు విషయాలన్నియు పల్లెటూళ్ళయందు ప్రచారములో నున్నవి.

ఈ సంపద అంతయు తెలుగు జానపదులకే దక్కినది.

# 12-12-1994న సి.పి.బ్రౌన్ 110వ వర్ధంతి

*(తెలుగు సాహిత్య సముద్ధరణా కారణ జన్ముడు: సి.పి. బ్రౌన్ రచన)*

In 1825 I found Telugu literature dead In thirty years I raised it to life అని తన స్వీయ చరిత్రలో చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ రాసుకున్న మాటలు స్వాతిశయపు పలుకులు కావు సిసలైన చారిత్రక సత్యాలు! తన22వ ఏట కడపలో కాలుపెట్టిన నాటినుండి, 1884లో లండన్‌లో తన తుదిశ్వాస విడిచేదాక ఆశ్వాసలో శ్వాసయై కొనసాగినది తెలుగు సాహిత్య సముద్ధరణే !

-డేవిడ్ బ్రౌన్-కాలే దంపతులకు రెండవ సంతానంగా 1778 నవంబర్ 10నాడు కలకత్తాలో జన్మించిన "భారతీయుడు" బ్రౌన్. తన 14వ యేట తండ్రి మరణంతో కుటుంబం లండన్‌కు మారింది. అక్కడ కళాశాల విద్య పూర్తిచేసుకొని ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వంలో తెలుగు వారి అదృష్టం కొద్దీ మద్రాసు సర్వీసుకు కేటాయించబడ్డాడు. 1817 ఆగస్టులో మద్రాసు ఫోర్టుసెయింట్ జార్జి కాలేజిలో మూడేళ్ళ శిక్షణకై చేరాడు. శిక్షణలో భాగంగా ఏవైనా రెడు భారతీయ భాషల్ని నేర్చుకోవాలనే నిబంధన ఉండేది. తెలుగు, మరాఠీలు ఎన్నుకున్నాడు బ్రౌన్. తన జీవిత కాలంలో గ్రీకు, లాటిన్, హిబ్రూ, ఫ్రెంచి, ఇంగ్లీషు, ఫారశీ మొదలైన 24 భాషల్లో పాండిత్యం గడించిన బ్రౌన్ తెలుగు భాష గురించి అప్పుడే తెలుసుకున్నాడు. వెలగపూడి కోదండరామయ్య పంతులు బ్రౌన్‌చే తెలుగు ఓనమాలు దిద్దించాడు. ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణత పొందిన బ్రౌనుకు శిక్షణ కాలంలో ప్రత్యేకాభిరుచి ఏమీ కలగలేదు.

"దేశ భాషలలో వ్యవహార జ్ఞానం లేకపోతే మిగతాజ్ఞానాలన్నీ సివిల్ సర్వీస్‌లో నిరుపయోగ"మని గవర్నర్ థామస్ మన్రోచేసిన ఉద్బోధ, కడప కలెక్టర్ మంజ్‌బరీకి తెలుగులో గల ధారాళత్వం ఆయనకు ప్రేరకాలైనాయి.

ఆ పిమ్మట సహచరులు నిరుత్సాహ పరచినా, పండితులు, భాషా భేషజం బాధించినా నీరు కారిపోకుండా తనదైన బాణీలో ముందుకు సాగాడు. రెండు సంవత్సరాల లోనే చక్కగా మాట్లాడగలిగాడు. దేశీయ పండితుల బోధనా విధానం పరదేశీయులకు పనికి రాదని భావించి బ్రౌన్ తెలుగు వ్యాకరణాన్ని బహుప్రయోజనాత్మకంగా కూర్చాడు. అనుభవంలోకి వస్తున్న పదాలతో నిఘంటు నిర్మాణానికి శ్రీకారం చుట్టాడు. మఛలీపట్టణంలో అసిస్టెంట్ జడ్జిగా చేస్తున్నప్పుడు కోర్టులో ఉద్యోగిగా ఉన్న పర్వం అద్వైత పరబ్రహ్మయ్యశాస్త్రి వద్ద ఛందశ్శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. పుస్తకాన్వేషణ హాబీగా ఉన్న బ్రౌన్,అబే దుబ్ (1770-1848) రాసిన "హిందూమేనర్స్, కస్టమ్స్ అండ్ సెరిమనీస్" అనే పుస్తకం చదువుతూ ఉండగా వేమన కవి ప్రస్తావన కనిపించింది. ఆ ప్రఖ్యాత తాత్త్విక కవి కడపజిల్లాలో 17వ శతాబ్ది చివరిపాదంలో జన్మించినవాడని అందులో చదివాడు. ఉత్సాహంతో వేమన పద్యాలను ఆంగ్లం చేసి స్వంత ఖర్చుతో ప్రచురించాడు. అప్పటినుండి తెలుగు సాహిత్య గ్రంథాలసేకరణ, అధ్యయనం, పరిష్కరణ ఆయన జీవిత పరమావధిగా మారింది.

రాజమండ్రిలో హెడ్ అసిస్టెంట్ కలెక్టర్‌గా చేస్తున్నప్పుడు ఆయన నిజాయితీ చేదు అనుభవాన్ని మిగిల్చి 1826 మార్చిలో జిల్లాకోర్టు రిజిస్ట్రార్‌గా కడపకు బదిలీ అయ్యింది. తనకు పరిచయం ఉన్న ఊరు కావడంతో పాటు, కోర్టు ఉద్యోగి (నాజర్)యైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి మిత్రుడుగా లభించాడు. నాజిమ్ మున్సిఫ్ హోదాకు ఎదిగి, చనిపోయేనాటి వరకు బ్రౌన్‌కు విశ్వాస

పాత్రుడుగా మెదిలాడు కృష్ణారెడ్డి. ఆ విధంగా కడప సాహిత్య పరిష్కరణ యజ్ఞానికి ప్రధాన స్థావరమైంది. ఆయనింటిని "బ్రౌన్ కాలేజి" అని పిలిచేవారు.

ములుపాక బుచ్చయ్యశాస్త్రి, రావిపాటి గురుమూర్తి శాస్త్రి జూలూరి అప్పయ్యశాస్త్రి, ధర్మపురం సుబ్బన్న, పర్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి, గరిమెళ్ళ వెంకయ్య, అరణమరం పెదవీరయ్య తదితర పండితుల సహకారంతో ఎన్నో గ్రంథాలను పరిష్కరింపజేసి శుద్ధ ప్రతులు సిద్ధం చేయించాడు. వ్యాఖ్యానాలు రాయించాడు. కొన్ని అచ్చు వేయించాడు; అచ్చువేస్తామన్నవారికి అందించాడు. భారత, భాగవతాది 36 పురాణేతిహాసాల్ని సేకరించాడు. తెలుగు, సంస్కృత రాత ప్రతుల సేకరణ కోసం 30 వేల రూపాయల ఖర్చుపెట్టాడు పండితుల జీతభత్యాలన్నీ తన సంపాదననుండే వెచ్చించేవాడు. 84 శతకాలను సేకరించి పరిష్కరింప జేశాడు వీటిలో కాళహస్తి లింగ శతకం వంటి భక్తి రచనలు, సుమతి శతకం వంటి నీతి బోధకాలే కాక, కవి చౌడప్ప వంటి అధిక్షేపాత్మక బూతు రచనలు సైతం ఉన్నాయి. జూలూరి అప్పయ్యశాస్త్రి సహకారంతో ముద్రించిన గ్రంథాలలో శతకాలే ఎక్కువ. 1834 నాటికి దాదాపు మూడు వేల వేమన పద్యాలను సేకరించాడు. ఆంధ్రులకు అత్యంత ప్రీతిపాత్రాలైన మనుచరిత్ర, వసుచరిత్రలను మొట్టమొదట వ్యాఖ్యానాతోపాటు అచ్చువేయించిన కీర్తి బ్రౌనుదే. ధూర్జటి శ్రీకాళహస్తి మహాత్మ్యాన్ని ఇంగ్లీషులో కథా సంగ్రహాన్ని రచించాడు. బైచరాజు వెంకటరాజు రచించిన పంచతంత్ర, హంస వింశతులకు పదసూచికలు సంతరించాడు. సింహాసన ద్వాత్రింశిక కథాసారాన్ని 43 పుటల్లో ఆంగ్లంలో సంగ్రహం చేశాడు. గౌరవ హరిశ్చంద్రోపాఖ్యానాన్ని 1842లోనూ, వైజయంతీ విలాసాన్ని 1849లోనూ అచ్చువేయించాడు. కళాపూర్ణోదయం, తారాశశాంక విజయం, విజయవిలాసం, కుచేలోపాఖ్యానాలను ముద్రింపజేశాడు. పాతికేళ్ళలో దాదాపు పాతిక ప్రబంధాలను పరిష్కరింప జేసిన సాహితీ ప్రేమికుడు సి.పి.బ్రౌన్. ముదిలంజులు పదకవితలని పండితులచే ఈసడింపబడిన ద్విపద కావ్యాలను సమవీక్షణంతో అభిమానించాడు. పండితారాధ్యచరిత్ర తదితర పదమూడు ద్విపద కావ్యాలను పరిష్కరింప జేశాడు. 25కి కాగితపు ప్రతులు రాయించాడు. బసవ పురాణాన్ని జంగముల విధివిధానాల్ని తెలిపే గ్రంథమని చెబుతూ మద్రాస్ జర్నల్ ఆఫ్‌లిటరేచర్ అండ్ సైన్సు (1840 అక్టోబర్ సంచిక)లో Account of Basava Purana the prinicipal book used as religious code by jangams అనే వ్యాసాన్ని ప్రకటించాడు బసవ పురాణం అద్భుత కథా సంకలనమని ఆయన అభిప్రాయం బసవపురాణాన్ని సంగ్రహంగా ఇంగ్లీషులో రచించాడు. ఇది ప్రస్తుతం మద్రాను ఓరియెంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో భద్రపరచబడి ఉంది. బసవపురాణానికి ఆ తరువాత పలువురు చేసిన తెలుగు వచనం, ఇంగ్లీషు అనువాదాలు అచ్చయినా బ్రౌన్యాలు మాత్రం వెలువడక పోవటం శోచనీయం! 1871లో జర్నల్ ఆఫ్ రాయల్ ఏసియాటిక్ సొసైటీ లో ప్రకటించిన Essay on Creed, customs & literature of jangams వ్యాసానికి పాల్కురికి సోమనాథుని రచనలే ఆధారాలు! పండితారాధ్య చరిత్ర, ప్రభులింగ లీలాది శైవపురాణాల పరిష్కరణ అరణిమఠం పెదవీరయ్య శాస్త్రి సహకారంతో జరిగింది. పెదవీరయ్యశైవుడైనా వైజయంతీవిలాసం వంటి వైష్ణవ రచనలు కూడా పరిష్కరించాడు. పల్నాటి వీరచరిత్రను ఆంధ్రుల సామాజిక జీవితాన్ని చిత్రించిన గ్రంథంగా బ్రౌను అభిమానించేవాడు బ్రౌను తెలుగు వాళ్ళ సంస్కృతీ, సంప్రదాయాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసకున్నాడని ఆయన ఏ రచన చూసినా తెలుస్తుంది.

సాహిత్య సంబంధమైన ఇతర సామగ్రిని కూడ అపారంగా సమకూర్చాడు. చాటుపద్యాలు, జానపద గీతాలు, సామెతలు, పలకుబడులు సేకరించాడు. తన కాలంనాటి పత్రికలలో వెలువడిన వ్యాసాలు

సంపాదకీయాలు, వార్తలు, లేఖలు మొదలైన వాటిని సమీకరించి మంచి కాగితాలపై వ్రాయించి ముందు తరాల వారికి అందజేశాడు. తానువిన్న కథలను, గాథలను 1855లో Popular Telugu Tales మరియు 'తాతాచారి కథలు' పేరిట అచ్చు వేయించాడు. మెకంజీ కైఫీయతులను 62 సంపుటాలలో మంచి కాగితాలపై వ్రాయించి భద్రపరిచారు. హిందూ శిల్పకళ (Hindu Sculture Asiatic Journal London, 1828)యే కాదు, తెలుగు మంత్రతంత్రాలు (Telugu Spells, MJLS, 1864 July) కూడ ఆయనను ఆకర్షించాయి. స్థలనామ విజ్ఞానం (Onamatics) తదితర భాషాశాస్త్ర విషయాల్లో కూడా కృషిచేశాడు. అరసున్నా, బండి 'ఱ'లు అవసరం లేదని తెలిపాడు. ప్రాథమిక దశలో ఉన్న తెలుగు ముద్రణా రంగానికి రావడి, న,స,వ,ప భేదాల విషయంలో తగు రూపాలను అందించాడు.

8,9 సంవత్సరాలు నిరంతరశ్రమ సలిపి 1852లో తెలుగు ఇంగ్లీషు నిఘంటువును 1853లో ఇంగ్లీషు తెలుగు నిఘంటువును పూర్తిచేశాడు. ఇంకా ఆయన నిఘంటు శ్రేణిలో లిటిల్ లెక్సికన్, మిశ్రభాషా నిఘంటువు (తెలుగు, పార్సీ, ఇంగ్లీషు లిపుల్లో), జిల్లా నిఘంటువు కూడ ఉన్నాయి. నిఘంటు నిర్మాణం (lexicography) లో బ్రౌన్‌ది ఒక ఒరవడి.

1845 జనవరి 27న తన గ్రంథాలయంలోని 2440 రాత ప్రతులను (తాలూకు ప్రతులతో సహా) మద్రాసు లిటరరీ సొసైటీకి అందజేశాడు. నేటి మద్రాసు ఓరియెంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి ఈ గ్రంథాలే మూలకందాలు. ఉద్యోగ జీవితంలో వైవిధ్యంగల ఎన్నో ఉన్నత పదవులు నిర్వహించినా ఆయన తనకంటూ సంపాదించుకున్నవి కేవలం ఈ తెలుగు గ్రంథాల కట్టలే.

1954లో పదవీ విరమణ చేసి లండను తిరిగి వెళ్ళినా తెలుగుభాషా సేవ మరువలేదు. 1863లో ప్రచురించిన 'కార్నటిక్ క్రానాలజీ' (కొన్ని లోపాలున్నప్పటికీ) హిందూ విజ్ఞాన సర్వస్వం అనదగిన రచన. 1865లో లండన్ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖను ఏర్పాటు చేయించి, అందులో తొలి తెలుగు ఆచార్యుడుగా చేరాడు. మిత్రులకోర్కె మేరకు 1866లో ఆత్మకథను వెలువరించాడు. చివరికి తన వీలునామాలో కూడా పుస్తకాల గొడవే!

తెలుగు భారతికి ఆయన చేసిన సేవను అందరూ ఉపయోగించుకొంటున్నా, ఆయన గురించి పట్టించుకున్న వాళ్ళు వేళ్ళమీదే ఉన్నారు. 1975లో శ్రీ వేంకటేశ్వర విద్యాలయం ఆచార్య జి.యన్.రెడ్డి సంచాలకత్వంలో ఏర్పాటుచేసిన 'సి.పి. బ్రౌన్ రీసెర్చ్ ప్రాజెక్ట్' పరిశోధనా అధికారి స్వర్గీయ బంగొరె మూడున్నర సంవత్సరాలపాటు అహోరాత్రులు కష్టపడి బ్రౌను రచనల్ని, అముద్రిత రాత ప్రతులతో సహా 52 సంపుటాలు సేకరించి మైక్రో ఫిల్మ్ రూపంలో భద్రపరిచారు. కొన్ని గ్రంథాల్ని కూడా విశ్వవిద్యాలయ పక్షాన ప్రచురించారు. దశాబ్దం క్రితం ఏర్పడ్డ సి.పి. బ్రౌను మెమోరియల్ ట్రస్ట్ వారు కడపలో భవన నిర్మాణం చేశారు. బ్రౌను పరిశోధనా సంస్థను అందులో తిరిగి నెలకొల్పాలని వారి సంకల్పం. ఇందుకు ప్రజలు, ప్రభుత్వం తోడ్పాటునందించటమే ఆ మహా పురుషునికి సరియైన నివాళి.

- డా॥ రాపోలు సత్యనారాయణ
సోమనాథ కళాపీఠం,
పాలకుర్తి, వరంగల్లుజిల్లా.

కథ

# "జిజ్ఞాస"

మూలం: శ్రీ ఎస్.కె. త్రిపాఠి

అనువాదం: శ్రీమతి పొరనంది నిర్మల

ఒకరోజు శీల్‌గారు నా హాస్టల్‌కు వచ్చేరు. నా చదువుకునే బల్లపైన డా॥ నగేంద్ర రాసిన ఒక పుస్తకం వుంది. ఆ పుస్తకాన్ని తీసుకుని, పేజీలు అటు ఇటు తిప్పుతూ అతి సహజంగా "డా॥ నగేంద్ర బ్రాహ్మణుడా?" అని ప్రశ్నించేడు. ఎంత నిష్కలుషితమైన జిజ్ఞాస అతడిది! జిజ్ఞాస లేనివాడు ఏంచదువుతాడు? ఏం నేర్చుకుంటాడు? రచయిత గురించి తెలుసుకోవలసిన విషయాలు తెలుసుకోవాలి. ఇటువంటి జిజ్ఞాస జనాల్లో ఉండబట్టే మా విశ్వవిద్యాలయం నడుస్తూంది. ఇక్కడ వున్న ప్రతి మనిషి ఈ జిజ్ఞాస వల్ల స్పందిస్తాడు. ప్రతి ఒక్కడిలోనూ ఈ తత్వాన్ని అవలంబించుకోవాలనే ప్రయత్నం వుంది. ఎంటీనా వలే శరీరంపై వున్న ప్రతి ఒక్క రోమంతోనూ జాతీయ తరంగాన్ని తనవైపు లాక్కోవాలనే తహతహ.

చదివేవాడు బ్రాహ్మణుడైతే పుస్తకం రాసిన వాడు కూడా బ్రాహ్మణుడై వుంటాడని శీల్‌గారికి మనసులో గట్టి నమ్మకం ఏర్పడి వుంటుంది. అందుకే, "డా॥ నగేంద్ర బ్రాహ్మణుడా" అని అడిగుంటాడు. ఎంత నిశ్చలమైన నమ్మకమో! నమ్మకం వల్లనే ఈ జగత్తు నడుస్తుందని చిన్నప్పుడు వినేవాడిని గాని ఇప్పుడు అర్థమైంది. ఇటువంటి నమ్మకం వల్లనే మా విశ్వవిద్యాలయం నడుస్తున్నది. ఈ విషయంలో అపవాదాలు కూడా వున్నాయి. ఆఖరున యీ అపవాదాలు గురించి కూడ కొన్ని ఉదాహరణలిస్తాను. లోకులకి అపవాదాలగురించి వినడం చాలా ఇష్టంగాని ఈ అపవాదాలు నియమాలు కావు. మీకు ఈ నియమాలు గురించి క్షుణ్ణంగా తెలియచేయడానికి ప్రప్రథమంగా మా విశ్వవిద్యాలయం మీకు చూపిస్తాను. ఉదాహరణకు 'శివాని' (హిందీ నవలా రచయిత్రికి తాను రవీంద్రనాథ్ స్థాపించిన 'శాంతినికేతన' ప్రొడక్టని గర్వమైతే మరొక్కడికి మాలవీయగారు స్థాపించిన బనారస్ విశ్వవిద్యాలంలో చదివినందుకు గర్వము. అలాగే ,నాకు కూడా చిన్న బాబుగారి విశ్వవిద్యాలయంలో చదివినందుకు కొద్దిగా గర్వముంది. జాతీయ సంస్కారంతో నిండియున్న ఈ పరమ పవిత్రమైన విద్యాభూమిలో పెరిగి విద్వాంసుడిని (?) అనిపించుకునే అదృష్టంనాకు కలిగింది. నేను మీకు, ఈ విద్యాభూమితో పరిచయం చేస్తాను శ్రీరామ చంద్రునికి భరతుడితో కలుసుకోవాలని, రాజ్యభారం తను తీసుకోవాలనీ తొందర వుండి వుంటుంది. అందుకే ఎగురుతూ సూక్ష్మంగా పరిచయం చేసి ఉన్నారు కాని నాకా తొందర లేదు. నాదగ్గర ఎగరటానికి విమానం కూడ లేదు. అందుకే నింపాదిగా కాలినడకనే మీకు విశ్వవిద్యాలయం అంతా చూపించి ఈ పవిత్రమైన భూమిని పరిచయం చేస్తాను.

ఆచార్య రజనీష్‌గారి దృష్టిలో ఖజురాహోలాంటి మందిరాలని చూసే సమయంలో ముందుగా మందిరము బయటవున్న శిల్పాలను సందర్శించాలి. వాటిని అర్థం చేసుకోవాలి. నేను కూడ ఈ విశ్వవిద్యాలయం పరిసరాలని చూపించేముందు బయటున్న గుడిశ హోటల్లో ఫలహారము చేయించి లోనికి తీసుకొని వెళదామను కుంటున్నాను.

౽ాని 'బైదివే' మీరు ముందుగా ఏజాతికి చెందినవారో ెలవివ్వండి. మీరుగాని బ్రాహ్మణ జాతికి చెందిన ారైతే ఎదురుగా వున్న హోటలు మీకు సరిపోతుంది. యాదవ కులస్థులైతే దక్షిణాన్ని ఉన్న హోటలు రిఅవుతుంది. అలాగే రాజపుత్రులు, కర్షక వర్గానికి ెందినవారికి హోటలు అటువైపుంది. వంటకాలు ఒకలాగే ుంటాయిగాని, స్వజాతిలోవున్న 'మా' అనే భావం మీకు క్కడ తప్పితే వేరే ఎక్కడ దొరుకుతుంది? ఈ ఏర్పాట్లు లన హోటలు యజమానులకు ఏవిధమైన చిన్నతనం ర్పడదు. అంట్లు తోమినా ఎంగిళ్ళు తీసినా మన జాతి ాళ్ళవే గదా! అనే సంతృప్తివుంటుంది. మరొక జాతి వాళ్ళ బ్బులతో బ్రతకటం లేదు గదా! మన జాతి వాళ్ళ బ్బులు వల్లనే బ్రతుకుతున్నాము. అంతా ఎందుకు, ూసగించబడివా మనవాళ్ళ వల్లనే గద! నెయ్యి పడినా ప్పులోనేగద! (నేలపైన కాదుగద!)

స్వజాతి ప్రేమకు చెందిన అంతర్జాతీయ ాజకీయాలను రుచి చూస్తూ మీరు విశ్వవిద్యాలయం ింహద్వారం దగ్గరకు రండి. సింహద్వారం ఎదుట బుద్ధుని ిగ్రహముంది. ఇక్కడనుండి లోపలికి వస్తుంటే యుద్ధమందిరంలోకి వెళుతున్నట్టు అనిపిస్తుంది. మా ురువుగారు చెప్పిన ఒక మాట విందాం. ఇక్కడ భూమి యుద్ధుడివంటి సాధకుడి భూమి అయినప్పటికీ అది వేరుగా ుంది. అతడు ధర్మం గురించి చెబుతాడు. నాకు ధర్మక్షేత్రం ురించి తెలియదు కురుక్షేత్రంగురించి ఎంతో కొంత ెలుసు. ఈ భూమి జాతి ప్రేమ, జాత్యాభిమానంతో నిండి ుంది. అది నాకున్నకాస్త సామర్థ్యంతో తెలుసుకో గలిగేను. ేను ఈ సందర్భంలో కురుక్షేత్రంలో జరిగిన యుద్ధాల ురించి వర్ణించను. యుద్ధంలో జరుగుతున్న ఘట్టాల గురించి ప్రత్యక్షవ్యాఖ్యానం చేయడానికి నాకు ధైర్యంలేదు. చంద్ర వరదాయి భూషణ వంటి వారి పాత్రని పోషించడం నానుదుట రాసిలేదు. ఎందరో మిత్రులు పృథ్వీరాజు, మహారాణా ప్రతాప్, శివాజీ, అవడానికి ఎంతో నిజాయితీగా ప్రయత్నించేరు. నేను యుద్ధశిబిరాలు కోటలు గురించి పరిచయం చేయగలను మరైతే వాటికి చెందిన జెండా (పతాకం) గురించి చెప్పగలను.

ఇప్పుడు మనం విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ప్రవేశిస్తున్నాము. గుమ్మందాటి ఇంట్లో అడుగుపెట్టే ముందే అగరొత్తుల సువాసన, ఎయర్ కండిషన్ చల్లదనం మనకు తెలుస్తుంది. అలాగే మీక్కూడా హాస్టల్ ముఖ్య ద్వారం వరకు వచ్చేముందే ఇక్కడ వాతావరణంలో జాతి ప్రేమ కనపిస్తూంటుంది. నావంటి తుచ్ఛుడు వీటిలో వున్న అన్ని విషయాల గురించి మీకు ఎలా చెప్పగలడు! స్వయంగా ఈ సముద్రం ఒడ్డున నిలబడి కాస్తోకూస్తో దీని గురించి మీరే తెలుసుకోగలరు. దీనిలో లాభం ఏమిటంటే ఎంత గొప్ప మెటీరియలిస్ట్ అయినా ఈ వాతావరణంలో అడుగుపెట్టగానే జాతి భావం, జాత్యభిమానం వలన చైతన్యవంతుడై పోతాడు.

ఈ నగరంలో రైల్వే స్టేషన్ వద్ద ఏవ్యక్తైనా తీర్థయాత్రికుడిలా కనిపిస్తే చాలు. పురోహితులు ఏజంట్లు వాళ్ళని ప్రశ్నిస్తారు," మీ పురోహితులెవరు? అని. అలాగే మా విశ్వవిద్యాలయంలో ఎమ్మేలో ఎడ్మిషన్‌లు మొదలవగానే జాతి స్వయం సేవకులు అంటే వాలింటియర్‌లు ఏజాతి వాళ్ళు ఎంతమందున్నారో లెక్కపెట్టడం మొదలెడతారు. ఉదాహరణకు నేను యాదవ కులస్తుడిని. మీ కులగోత్రాలు నేను తెలుసుకోవచ్చా? "అహ నేనెంత అదృష్ట మంతుడిని! నాజాతికి చెందిన

సోదరుడు యింత తొందరగా యీ భూమిపై కలసేడు. నేను కూడా ఆ వంశానికి చెందిన వాడినే! అంటాడు. ఈ విధమైన పరిచయాలు క్లాసులు మొదలైయ్యాక మరింత ఎక్కువగా వుంటవి. రెండు మూడు రోజుల్లో యీపని పూర్తై పోతుంది. ఆ తరువాత ప్రతి జాతి వాళ్ళు తమ తమ నాయకుల సౌకర్యం, సమయం బట్టి సభలేర్పాటు చేసుకుంటారు. ఈ సభలో నవాగంతుకుడికి స్వాగతం పలుకుతారు. తమ అగ్రరాజులు అంటె, సీనియర్, గ్రేడ్ సీనియర్, ఓవర్‌గ్రేండ్ సీనియర్, సూపర్ సీనియర్, మహాసీనియర్, పరమ్ సీనియర్, చరమ సీనియర్, ఘోర్ సీనియర్‌తో పరిచయం చేయిస్తారు. తమ శిబిరాలు, కోటలు స్థావరాలు గురించి చెబుతారు. తమ రణనీతి రహస్యం చెబుతారు! నవాగంతుకుడికి విశ్వవిద్యాలయంలో జీవితం ఎలా గడపాలి, ఎవరితో ఎలా వ్యవహరించాలి, ఎవరు మన వాళ్ళు, ఎవరు యితరులు, ఎవరు పొలిటిక్స్‌లో వున్నారు. వంటి విషయాలను తెలియజేస్తారు.

ఇక్కడ ప్రేమ వ్యవహారాలు కూడా స్వజాత్యాభిమానంతో కూడి వుంటాయి. ఒక వేళ ఎవరినైనా ప్రేమించాలంటే మన జాతివాళ్ళనే ప్రేమించాలి.మన జాతిలో ఏకొరత వున్నది ఇతరజాతివాళ్ళని అడుక్కుందుకు. దురదృష్టవశాత్తు మరొకజాతి వాళ్ళని ప్రేమించారంటే మన జాతి చరిత్రకే చెడ్డపేరు వస్తుంది. "ఈమెకి వున్నజాతిలో ఎవరు దొరకలేదా! మరొక జాతివాడితో ప్రేమాయణం జరుపుతూంది! అని ఆ జాతి వాళ్ళు గుండెలు బాదుకుంటారు. ఆమె మనజాతి తల తెగ్గొట్టినంత పని చేసింది అంటారు. ఆ జాతికి చెందిన వాళ్ళందరు క్షోభతో కుమిలిపోతారు. ఈ పరమ పవిత్రమైన ప్రేమతో నిండిన వాతావరణంలో ఇంతపని జరిగిన తరువాత కూడ తల ఎత్తుకొని నడిచే వాళ్ళంత సిగ్గులేని వాళ్ళెవరూ వుండరు. బంధువులు, సన్యాసులు తమ ఉపన్యాసాలిక్కడ వచ్చి ఇవ్వరుగాని అది జరుగుతే అప్పుడుకూడా ఈ మర్యాదని పాటిస్తారు. అంటే తమ జాతికచెందిన సాధు ప్రవచనాలే వినడానికి వస్తారు.

దీని గురించి ఈ విధంగా నోటీసు వుంటుంది. "రాజపుత్ర సోదరులారా! మీ అందరికీ ఒక సంతోషకరమైన శుభవార్త. మన జాతిలోవాడే ఒక వ్యక్తికి ఆత్మసాక్షాత్కారం కలిగింది. అతడు తన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సర్వత్ర ప్రసరింపచేస్తున్నాడు. రాజపుత్ర సభ ద్వారా ఏర్పాటు చేయబడిన ఈసభకు ఎక్కువ సంఖ్యలో విచ్చేసి తమ జాతిప్రేమను సంఘటిత తత్వాన్ని మరొకసారి నిరూపించమని మనవి."

ఇవన్నీ పైపై విషయాలు. ఇప్పుడు కొన్ని కోటలు స్థావరాలు గురించి పరిచయం చేస్తాను. మనమిప్పుడు రెండో నంబర్ హాస్టల్ వద్దకు వచ్చేశాము. హాస్టల్ నంబరు రెండు రాజపుత్రులకోట. ఈ హాస్టల్ పేరు "ఫలానా"వీర్ సింహఛాత్రావాసము. నిజం చెప్పాలంటే, వీర్ పలానా సింహవాళ్ళకి దేవత. పాతకాలపు భాషలో 'కులదేవత' అనవచ్చు హాలులో ఇతడి నిలువెత్తుఛాయాచిత్రం కూడా వుంది. ఎప్పుడు విద్యార్థులు నినాదాలు చేస్తుంటారు. ఫలానా సింహపేరు పలకగానే విద్యార్థులు మీసాలు దువ్వడం మొదలెడుతారు. పలానా బాబు సింహని యావత్ భారతదేశము 1857 స్వాతంత్ర్య సమరయోదుడు, దేశభక్తుడని అనుకోవచ్చు. గాని ఇక్కడ జీవులకి, ఈ అతి వ్యాప్తినచ్చదు. వీళ్ళు అతడిని తమ పూర్వీకుడని గర్వపడతారు. ఈ హాస్టల్‌ని విద్యార్థులు 'కోట' అని

ఏలుచుకుంటారు, గర్వ పడతారు. అవసరము వచ్చినప్పుడు రెండు కత్తులున్న కాషాయి రంగు జెండా లెగరేస్తూంటారు. కర్షకులు కొటలొకి వెళ్ళేముందు ఒకసారి ఇక్కడ వున్న సెంట్రల్ లైబ్రెరీలోకి ముందు తీసుకువెళ్ళుతున్నాను ఎందుకంటే ఇక్కడ బాబు ఫలానా సింహ చిత్రపటం వేలాడితీసివుంది. ఈ నగరంలో ఎవరో విద్యాప్రేమికులు తన యావత్తు పుస్తకాలని ఈ లైబ్రెరీకి దానం చేసేసారు. కారణం ఏంటొ తెలియదు. ఈ పుస్తకాలయానికి అతని పేరు పెట్టేరు గాని అతనిదిగాని మరె పండితునిదిగాని చిత్రఫలకము అక్కడ లేదు. దీన్నిబట్టి అనిపిస్తుందేమంటే 'కోట' సామ్రాజ్యం, హాస్టల్ నంబరు మూడు కర్షకుల కోట. ఏవిధమైన ఉపన్యాసాలు వగైరాలు జరగక పోయినా ఏడాదికొకసారి సరస్వతీపూజ మాత్రం తప్పనిసరిగా చేస్తారు. ఈ సందర్భాన పౌరోహిత్యం తప్పనిసరిగా కర్షకులే నిర్వహిస్తారు. బ్రాహ్మణులు పాపం చేతులు నలుపు కుంటారు. ఈ హాస్టల్పైన కర్షకులతో పాటు 'బెక్‌వర్డ్‌క్లాస్' వాళ్ళు కూడ తమ అధికారం చూపిస్తూంటారు. ఇక్కడ 'చరణసింహ జిందాబాద్' 'లాలూయాదవ్ జిందాబాద్' అనే నినాదాలు తరచు వినిపిస్తుంటాయి. కొన్ని విశిష్టమైన సందర్భాలలో ఉద్రిక్త పరిస్థితులలో హాస్టల్ డాబాపైన ఆకుపచ్చరంగు జెండా ఎగరేస్తారు. అప్పుడప్పుడు అస్త్రశస్త్రాలతో జెండా వందనం సమర్పిస్తూంటారు. లేక ఈ వంకనే శత్రువులని రెచ్చకొడుతుంటారు. మరో హాస్టల్పై కూడ జెండాని ఎగరేసి లేక గాలిలో తుపాకులు కాల్చి తమ ఐక్యతను చూపిస్తూంటారు. ఎన్నికల దృష్ట్యా కర్షకులు బేక్‌వర్డ క్లాసువాళ్ళు ఒకే కోవకి చెందినవారు. అప్పుడప్పుడు తప్ప మూడవ నంబర్ యొక్క సహ అస్తిత్వము ఎప్పుడూ శాంతంగానే కొనసాగుతుంటుంది.

నాలుగవ నంబరు హాస్టల్ జాతీయ తత్వం దృష్టితో కలిసి మెలసియున్నది. ఎక్కువ సంఖ్యలో బ్రాహ్మణులు ఈ హాస్టల్‌లోనే వున్నారు. మిగతా హాస్టళ్ళులాగే జాతి ఆధారంపై మెస్‌లున్నాయి. ఏమెస్‌లో నైనా సరే మరో జాతికి చెందినవాళ్ళు రెండవరకం పౌరులు క్రింద జమకట్ట బడతారు. బ్రాహ్మణులు ఈ ప్రయత్నంలో విజయం సాధించేరు. బ్రాహ్మణులని నాలుగవ శక్తిక్రింద గుర్తించేరు.రాజపుత్రులు, కర్షకులు, బేక్‌వర్డ్, నాలుగవశక్తి బ్రాహ్మణులు, బ్రాహ్మణుల్లో కూడా వర్గభేదంవుంది. వీటిలో ముఖ్యమైనవి కాన్యకుబ్జులు, శాకద్వీపస్థులు. నాయకత్వం కాన్యకుబ్జులే చేపట్టారు. ఎందుకంటే హాస్టల్‌లో ఏరే అధిక సంఖ్యాకులు, కాన్యకుబ్జుల్లో ఒక నాయకుడు కాన్యకుబ్జులనే అసలు సిసలైన బ్రాహ్మణులంటారు. తక్కిన వాళ్ళని అబ్రాహ్మణులు లేక నాన్‌బ్రాహ్మణులు అంటారు. చివరన ఉత్తర దిశలోవున్న హాస్టల్ నంబర్‌వన్ సైన్సు హాస్టలు. కనీసం సబ్జెక్టు ఆధారంపై ఒక హాస్టల్ వుంది. గదులు జాతి వారసత్వం ఆధారంపైనే కేటాయించబడ్డాయి. కాయస్థుడు గది కాయస్థుడుకే చెందుతుంది. పరీక్షకు వెళ్ళే విద్యార్థులతో గ్రేండ్ జూనియర్ విద్యార్థులు కలుస్తూనే వుంటారు. ఇంతేకాదు తన సేవలు నమ్రత నిజాయితీ వలన గ్రేండ్ సీనియర్‌కి నమ్మకస్థుడవుతాడు. ఇంతేకాదు, అతడి గది తాళంకూడ తీసేసుకుంటాడు. ఆ తరువాత యూనివర్‌సిటీ ఆఫీసుకు వెళ్ళి హాస్టల్‌లో ఎడ్మిషన్ తీసుకుంటాడు. ఆ తరువాత తన ఆధీనంలో వున్న గదిని తన పేర ఎలాట్ చేయించేసు కుంటాడు. అటు విశ్వవిద్యాలయం ఆఫీసు వాళ్ళకి తలబ్రద్దలు కొట్టుకొనే అవసరం వుండదు. ఇటు విద్యార్థులకు కూడ తనమార్గాన్నే వెతుక్కునడం అలవాటౌతుంది. ఆత్మ విశ్వాసం

పెరుగుతుంది. అప్పుడప్పుడు తెలివి తక్కువ విద్యార్థులు ఎడ్మిషన్ తీసేసుకొంటారు గాని హాస్టల్‌లో గది ఎప్పటికీ దొరకదు తాళంచెవి తీసుకోకుండా ఎడ్మిషన్ తీసేసుకున్న తప్పుకి శిక్ష అనుభవించవలసి వస్తుంది. ఏ విజాతీయుడికీ గది ఇవ్వడమంటే, అంతర్జాతీయ వివాహం చేసుకొన్నంత అపరాధం క్రింద లెఖ్ఖకడతారు. పై చెప్పిన వన్నీ రాయబడిన నియమాలు నిబంధనలు, ప్రస్తుతం ఒకటవ నంబరు హాస్టల్‌వైపే లైటు ఫోకస్ చేసివుంచుదాము. అతి ఎక్కువ సంఖ్యలో కాయస్థులు ఇక్కడే వున్నారు. వీళ్ళు ఇక్కడ నుండే తన రాజకీయాలు నడుపుతుంటారు.

మనము ఇప్పుడు ఈ హాస్టల్ ప్రక్కనే ఉన్న హాస్టల్ నంబర్ ఐదులోకి వెళదాము. 'సుజాత' అనే పేరుగల ఈ ఛాత్రావాసం కేవలం ఆడవాళ్ళ కోసమే కేటాయించబడింది. ఇక్కడ వుండే విద్యార్థినులు మొగవాళ్ళ హాస్టల్‌కు వెళ్ళరు. వాళ్ళే ఇక్కడకు వచ్చి ముఖ్యమైన సూచనలూ వార్తలూ ఇస్తుంటారు తమ జాతి మీటింగ్స్‌లో తీసుకున్న నిర్ణయాల గురించి వీరికి తెలియజేస్తుంటారు.

ఈ విధంగా ఈ విశ్వవిద్యాలయాలలో ఒక ప్రత్యేకమైన జీవితశైలి, జీవనధార వుంది.

క్లాసులు మొదలయే ముందే నకుల్ అనే కర్షక జాతికి చెందిన విద్యార్థి తనని నాయకుడిగా స్థాపించుకున్నాడు, ఎప్పుడైతే 'ప్రతిభ' అతనితో పరిచయం చేసుకుందామని ముందుకొచ్చిందో అప్పుడు అతినమ్మకం వలనా, వుత్సాహం వలనా (ఓవర్‌కాన్ఫిడెన్స్) నకుల్ ఆమెను అడిగేసేడు, "మీరు కర్షక జాతికి చెందిన వారేనా?" అని. "ప్రతిభ కూడ ఔనని స్వీకారోక్తి పలికింది, ఆ తరువాత వారిద్దరి మధ్య స్నేహం మొదలైంది. అదే కాకుండా గిఫ్టులు ఇచ్చుకోవడం పుచ్చుకోవడం కూడా సాగడం మొదలయ్యాయి. కర్షక మిత్రులు కూడ ఆమెతో పరిచయం స్నేహం చేసుకుందామని ఆరాటపడటం మొదలెట్టారు. ఒకమారు నకుల్‌గారు ప్రతిభ యింటికెళ్ళాడు. ప్రతిభ యింటిలో ఒక పెద్ద పటం వేలాడతీసి వుంది. అతనితో వెళ్ళిన మిత్రులలో ఒకరు ఆ ఫొటోలోవున్న వ్యక్తిని పోల్చుకున్నాడు. అదేంటి ఇది శ్రీరామరాజ్‌సింహ పటం, క్షణంలో ఆశ్చర్యం నమ్మకంగా మారిపోయింది. శ్రీరామరాజ్ సింహ జమీందార్ వర్గంకి చెందిన నాయకుడు. అది కర్షక జాతికి చెందినవారి యింట్లో ఎలా వుంటుంది? ప్రతిభ తప్పకుండా జమీందార్ వర్గానికి చెంది వుండాలి. అయ్యో! ఎంత ద్రోహం జరిగింది. ఆ తరువాత ఆ మిత్రబృందం అందరికీ ప్రతిభ కర్షక జాతికి చెందింది కాదు, జమీందార్ వర్గంకి చెందింది అన్న నమ్మకం కలిగింది.

ప్రతిభ ఒక బొమ్మవలన పట్టుబడింది. వెతికే వాళ్ళకి మనం ఎంతదాచినా ఏదో ఒక రహస్యం దొరికి పోతూంటుంది. దాని వల్ల తెలివైన వాడికి వాళ్ళ అసలు రంగు తెలిసి పోతూంటుంది.

ప్రతిభ సంగతి కంటే కమలేశు సంగతి భిన్నం కాదు, గంభీరమైనది కూడ. రాజపుత్రుల కోటలో అతి గౌరవంగా ప్రవేశించిడమే కాకుండా వాళ్ళ అన్ని రహస్యాలు రణనీతి రహస్యాలను తెలిసేసుకున్నాడు. రాజపుత్రులకు అతడు రాజపుత్రుడు కాదు, గొల్లవాడనే విషయం తెలిసింది. కమలేశ ఎప్పుడైతే ఇక్కడ ఎడ్మిషన్ తీసుకున్నాడో అప్పటినుండి రాజపుత్రుడుగానే వుండిపోయాడు. అతడు రాజపుత్రుల ఎంగిలి రొట్టెలు కూడ తినేవాడు. తమజాతి వాళ్ళతో నమ్మక ద్రోహమేమిటి? "ఈ అగాధమైన విశ్వవిద్యాలయంలో గర్వంగా గొప్పగా వుండాలంటే రాజపుత్రులై వుండాలి", అనే గురుమంత్రంతో దీక్షపుచ్చుకొని

వచ్చేడని అందరు అనుకునేవారు. కమలేశ పేరు వెనుక సింహని చూసి అతడు రాజపుత్రుడై వుంటాడనుకున్నారు. ఎందుకంటే గొల్లజాతికి చెందిన వారు తమ పేరుతో 'యాదవ' అని కలుపుకుంటారు. కమలేశతో కలుసుకుందుకు వచ్చిన అతడి బంధువుద్వారా అతడి జాతి గుట్టు బయటపడింది. ఆ సమయంలో కమలేశ అక్కడ లేడు. ఆ బంధువు 'కమలేశ యాదవ' అని పేరుతో అతని గురించి రాజపుత్ర యువకులను అడిగేడు, ఇంకేముంది అంతా బట్టబయలైంది. అయ్యో! ఎంతదగా! ఇంత ఘోరమా! ఇంత నమ్మక ద్రోహమా! రాజపుత్రులు చాల కలత చెందేరు. చరిత్ర పునరావృతమైనది. కర్ణుడు వంచించి ఎలాగైతే బ్రహ్మాస్త్రం నేర్చేసుకున్నాడో అలాగే వీడుకూడ అన్ని రహస్యాలు తెలిసేసుకున్నాడు. కర్ణుడు నేర్చుకున్న విద్య శాపంవలన పోయింది, గాని వీడు సంపాదించిన రహస్యాలు మీవంశంలో లేవుగదా! ఏ రహస్యాలైతే ఇతగాడు యాదవుల కోటకి అందించేసేడో, వాటి సంగతేమిటి? ఇహ స్థావరాలు, కోడ్ నంబరులు మార్చేసేయాలి, 'మరొకసారి యదువంశస్థుల్ని నాశనం చేసితీరాలి. రెండవ మహాభారతం యీ అగాథమైన విశ్వవిద్యాలయం ప్రాంగణంలోనే జరుగుతుంది, నిజంగానే యీ మోసగాళ్ళు అందరు కృష్ణుడు వంశస్థులే!" దానితో ఇక్కడ వున్న యదు వంశీయులను నాశనం చేయాలని అనుకున్నారు.

పై చెప్పిన రెండు ఉదాహరణలు అపవాదులు.

మీరు మనసులో అనుకుంటూండవచ్చు, "అదేమిటి హరిజనులు గురించి అసలేమి రాయలేదేమిటి!" అని, ఈ విశ్వవిద్యాలయంలో హరిజన విద్యార్థులు వుండరు, వారికి టౌనులో వేరే ఒక హాస్టలు కట్టేరు. అది హరిజన హాస్టలు -పేరుతో పిలవబడుతున్నది. ఇంటర్ నుండి, ఎమ్.ఎ. వరకు హరిజన విద్యార్థులు ఇందులోనే వుంటున్నారు.

ఇంకో ముఖ్యమైన విషయం - ఒక కొత్త కులపతి ఈ పాతకాలపు వర్ణాశ్రమ వ్యవస్థని అంతంచేయాలనే ఉద్దేశంతో ఈ కోటలన్నిటినీ కూల్చేసేడు. ప్రతియొక్క జాతికి సంబంధించిన తేనె పట్టుకి పొగచూపించి శాంతి సామరస్యాన్ని భంగపరిచేరు. ఐతే నిరాశచెందనవసరము లేదు. మన మనసు స్వచ్ఛంగా వున్నప్పుడు మనసులో ఒక వ్యవస్థ సుస్థిరంగా వున్నప్పుడు బయట ఎన్ని అల్లరులు జరిగినా చెక్కు చెదరదు. మన నమ్మకం గట్టిదైతే మందిరం కూలినా ఏమీ ఫరవాలేదు. మందిరం మనసులోనే నిర్మించుకోవచ్చు. పూజ, మీటింగ్ వంటివి ఆరుబయట చేయవచ్చు. వీలు చూసుకుని స్థలం దొరకగానే పెద్ద మందిరం కట్టేసుకుంటాము. ప్రస్తుతం ఈ మారిన వాతావరణంలో అన్నీ మళ్ళీ 'సెట్' చేసుకోవాలి.

పుస్తక సమీక్ష

# సాహితీ జీవనతరంగాలు

డా. అందె వేంకటరాజంగారు కవిగా, అవధానిగా ఆంధ్రసాహితీ లోకానికి సుపరిచితులు. వారు అనేక పద్యగేయ వచనరచనలు వెలయించి ప్రసిద్ధి నొందారు. 'సాహితీ జీవన తరంగాలు' అనె ఈ పుస్తకం వేంకటరాజంగారి జీవన స్రవంతితో ఒడ్డు లొరిగిన సాహితీతరంగాల వివరణ. అనేక రూపాలతో సాగిన తరంగ భంగిమలను ఏకత్రం చేసికూర్చిన ఈ పుస్తకం సహృదయుల ప్రశంసకు పాత్రమౌతున్నది. ఇందులొ సాహితీ జీవనమే తప్ప వ్యక్తిగత జీవిత విశేషాలు అంతగా లేకపోవడం మెచ్చుకోదగిన సంగతి.

రకరకాల తరంగాలను మనం ఈ పుస్తకంలో చూడగలం. మహాకవుల పరిచయాలు, కావ్యాలలో, వాడుకలొ ప్రయోగించబడిన కొన్ని పదాల అర్థ వివరణ మొదలైన ఎన్నో విషయాలు ఈగ్రంథంలో చోటుచేసుకున్నాయి. వానమామలై వరదాచార్యులుగారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు మొదలగు మహాకవుల పరిచయం, వారి ప్రోత్సాహం, కవితా రచనకు మెరుగులు దిద్దుకోవడం, ఉపాధ్యాయుడుగా పాఠ్యాంశబోధన సందర్భాలలో ఎదురైన సమస్యలు వాటి పరిష్కరించడంలో వేంకటరాజంగారు చూపిన నేర్పు ఈలాంటివి అనేక విషయాలు పుస్తకంలో వున్నాయి.

కొన్ని పదాల అర్థ వివరణలో వేంకటరాజంగారు ప్రదర్శించిన ప్రజ్ఞ పండితుల మన్ననకు పాత్రమౌతున్నది. ఉదాహరణకు పన్నీరు, బేజవరాలు చెక్కుగటిన, తనువులెన్న, విద్యుద్వంతం, ఫలాహారం - శాఖాహారం, కాలుమడి మొదలైన పదాల అర్థముల తీర్పు, తెలంగాణా ప్రాంతంలో వాడుకలో ఉన్న లొల్ల. మజ్జిగ-చల్ల, ఉసుక, గొల. ప్యాట-పేట ఈలాంటి పదాల తీరు తెన్నులను వివరించడంలొని విజ్ఞానం రచయిత బహుముఖ ప్రజ్ఞకు అద్దం పడుతున్నది.

మహాకవి వానమామలై వరదాచార్యులు గారి షష్టిపూర్తి మహోత్సవం జరుపడంలో వేంకటరాజంగారు తాను చేసిన కృషిని గూర్చి తెలిపిన అంశం పాఠకులకు ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కలిగిస్తుంది. బోధన సందర్భాలలో పాఠశాలలో, కళాశాలలో విద్యార్థుల ప్రశ్నలకు గడుసుగా, చమత్కారంగా సమాధానాలివ్వడం వేంకటరాజంగారి సమయోచిత ప్రజ్ఞకు చక్కని ఉదాహరణలు.

ఈలాంటి ఒక మంచి పుస్తకాన్ని సంతరించి ఆంధ్ర లోకానికి అందించిన అందెవారు అభినందనీయులు.

- వేముగంటి

రచన - డా. అందెవేంకటరాజము

వెల రూ. 45/-

ప్రతులకు : డా. అందెవేంకటరాజము

మహేశ్వరీ గ్రంథమండలి, 2-3-18, మార్కండేయ మందిరం వద్ద, కోరుట్ల - 505 326, జిల్లా కరీంనగర్.

# అవధాన పద్యమంజరి

ఆంధ్ర సాహిత్యలోకంలో అవధాన ప్రక్రియకు ప్రత్యేక స్థానమున్నది మాడభూషి వెంకటాచార్యులు, తిరుపతి వెంకటకవులు మొదలగు వారినుండి ఈనాటి వరకు అవధాన కళ అవిచ్ఛిన్నంగా కొనసాగుతూవస్తూ రసజ్ఞ హృదయాలను ఆనందపులకితం చేస్తున్నది తెలుగునాట పలుచోట్ల నేడు ఎందరో కవులు అష్టావధాన శతావధాన, సహస్రావధానాలు చేస్తూ తమ తమ ప్రతిభా వైదుష్యాన్ని ప్రదర్శించడం మనం చూస్తూనే ఉన్నాము ఈలాంటి అవధాన ప్రక్రియకు ఆకర్షితులైన ప్రసిద్ధ కవివరేణ్యులు అందెవేంకటరాజంగారు 66 అష్టావధానాలు నిర్వహించి పండిత పామరలోకాన్ని ఆనందింపజేసి, వారి ప్రశంసలకు పాత్రులైనారు.

అందె వేంకటరాజంగారు ఆంధ్రదేశంలోనే కాక పూనా, బొంబాయి మొదలైన ఇతర రాష్ట్ర నగరాలలో కూడా ప్రతిభావంతంగా అవధానాలు చేసి సన్మానాలు పొంది, "అవధాన యువకేసరి" అనే బిరుదు నందినారు. సమస్యా పూరణ, సద్యోవర్ణన, దత్తపది మొదలైన అంశాలను చక్కగా నిర్వహించడం, ధారణచేయడం వేంకటరాజంగారి ప్రజ్ఞా విశేషతను ప్రదర్శిస్తున్నది. ఇందుకు కొన్ని ఉదాహరణలు చూపబడుతున్నాయి.

జగిత్యాలలో చేసిన అవధానం సందర్భంలో చెప్పిన సద్యోవర్ణన పద్యం.

"కుడువక బంధుమిత్రులకు
కూర్చినవారికి పెట్టకెంతయున్
ఓడుచును బిల్లికేయకయె
పిచ్చిగ కూర్చిన ద్రవ్యమంతయున్
దుడుకు ఖలు దొంగలయ్యెడల
దోచుకపోయిన జూచి నేలపై
బడి కడునేడ్చెం బొర్లుచొక
పాపపులోభి దురంతవేదనన్"

ఇది లోభిని గూర్చి చెప్పిన పద్యం.

పెద్దపల్లిలో జరిగిన అవధానంలో చెప్పిన హృద్యమైన సద్యోవర్ణన పద్యం కవితా కన్యను గూర్చి.

"మృదుతరశయ్యలొప్పంగ
మిక్కిలిమోదము గూర్చి సొంపుగా
బదములనల్లనన్ నిలిపి
బందురభావవిలాసలీలలం
సదమల వృత్తి చిత్తము
ప్రసన్నముగా గరగించి నిత్యమున్
మదగజయాన కావ్యసతి
మంజులయై తనుపున్ రసజ్ఞునిన్"

ఇందులోని శయ్య. భావవిలాసం, వృత్తి మొదలైన పద ప్రయోగ వైచిత్రి గమనింపదగినది.

కరీంనగరంలో నిర్వహించిన అవధానంలో చెప్పిన సమస్యాపూరణ పద్యం.

సమస్య "శనివారము కాదు కాదశనివారమ్మో" పూరణ చాలా చక్కగా చేయబడినది

"ఘన ఝుం ఝుం ఘోరగతి ను
ప్పెనగా జృంభించి ప్రళయ భీభత్సంబున్
బొనరి - చె మొన్నయమో ! యది
శనివారము కాదు కాదశనివారమ్మో"

అది శనివారం కాదు అశనివారమని చెప్పడం చమత్కారం.

చౌటుపల్లిలో చేసిన అవధానంలో దత్తపది ప్రశంసనీయంగా ఉంది ఇది మత్తకోకిలవృత్తం. విస్తరి, ఒప్పు, పుడ్క, పచ్చడి అంశం కృష్ణరాయబారం.

"విస్తరించెడు రాజ్యకాంక్ష వివేకమాకురురాజ! నా
శస్త్రబుద్ధిని జూపవేటికి? చాటెదొప్పని మాటలన్
గస్తియేలకొ పుడ్కవచ్చునె కాలుప్రోలికి. బోవుచో
దుస్తరం బిది నిన్ను భీముడు ద్రుంచి పచ్చడిగా నగున్"

ఈ విధంగా వేంకటరాజంగారు తమ అవధాన నిర్వహణ చాతుర్యాన్ని చూపించారు. అవధాన పద్యాలను ఒక చోటకూర్చి తెలుగు సహృదయుల కందించిన అందెవారు ప్రశంసనీయులు

- వేముగంటి

కృతికర్త - డా. అందె వెంకటరాజము వెల రూ. 45/-

ప్రతులకు : డా. అందెవేంకటరాజము, మహేశ్వరీ గ్రంథమండలి, 2-3-18, మార్కండేయ మందిరం వద్ద, కోరుట్ల - 505 326, జిల్లా కరీంనగర్.

# మహాస్వప్నం సుమనశ్రీ కావ్యస్వప్నం

- మాదిరాజు రంగారావు

డా॥ సుమనశ్రీ ఇటీవలి కావ్యం మహాస్వప్నం ఆధునిక తెలుగు కవితా ప్రపంచంలో ప్రత్యేకంగా పేర్కొనదగింది. సామాజికం రాజకీయం మనోలోకం అనుభూతి రూపం ఇట్లా అనేక రీతుల్లో ప్రవర్తమాన మయ్యే నేటి కవిత్వం ఎంతో వైవిధ్యోపేతంగా ఉంది. ప్రజాస్వామ్య వ్యవస్థకనుగుణమైన భావ సంపన్నతతో బృహద్వ్యక్తిత్వాన్ని స్ఫురింపజేస్తుంది.

ఈ కావ్యం స్త్రీ భావనా కేంద్రంగా సౌందర్యం, వివశత్వం రహస్యం, అద్భుతం అనే దృక్కోణాలతో దర్శించే నేత్ర ఊపం దూరంలో ఉన్న వస్తువుల్ని సమీపానికి తెచ్చి దర్శింపజేస్తుంది నేత్రం. ఇందులో వస్తువు జీవితంలో అనేకమైన భావరూపాలతో సంశ్లిష్టమైందీ సుకుమారమైన స్పందనల్ని కలిగిందీ. బాధ వేదన రహస్యం ఆనందంతో కూడిందీ. ఈ మన: ప్రపంచంలోని సౌందర్య భావచిత్రశాలా దర్శన రూపమే ఈ కావ్యం అనవచ్చు. "ఒక్క కన్నే కాదు ఇంద్రియాలన్నీ స్వప్నిస్తాయి" అన్న కవి మాట నా ఆలోచనకు సూత్రాన్ని అందిస్తూంది. ఈ మనో అనుభవ ప్రధానంగా చిత్రితమైన జీవితం ఇందులో సాక్షాత్కరిస్తుంది. ఇది స్త్రీ భావనాత్మకంగా అమె సౌందర్యా విష్కారకంగా సాగింది. ఒక్కొక్కపుడు తాత్త్విక చింతనకలిగే అద్వైత భావనాత్మకంగానూ ప్రవృత్తమైంది. భౌతికం మానసికం ఆత్మతలాలపై, ఒక వలయంనుండి మరో వలయంలోకి క్రమిస్తూ ఈ కావ్యం నిర్మితమైంది. వస్తువేది? ఇది ఎట్లా సమీకృతమైంది? ఎట్లా దర్శితమైంది? స్త్రీ భావన, పై మూడు స్థాయిల్లో; అద్వైత భావనాత్మకంగా అని సమాధానం దొరకుతుంది.

"శరీరం ఒక అగ్ని వృక్షం. ఇది జ్వాలావలయిత మైంది" ఆ అగ్ని వృక్షాన్ని శమింపజేసేది నీలమేఘం; సముద్రం; మాత్రమే. ఈ అగ్ని వృక్షానికి నీడలూ ఉన్నాయి. ఆ నీడల్లో కరగిపోయే కొవ్వొత్తి! పాలసముద్రం బొమ్మలా! సౌందర్యమూర్తి! ఇందులో మనిషిలో మనిషి చేసే ఆత్మీయ సంభాషణ ఒక శిల్పం, ఊపిరిలో ఆలోచనతో అనుభవంతో నిక్షిప్తమైన రహస్యాలకు అక్షరాకృతి ఈ కావ్యం.

నిద్రలో మన: కవాటం కాస్త తెరచుకుంటే చాలు! మనస్సుపై బరువు అంతో ఇంతో ప్రక్కకు తొలగితే చాలు! పైపైకి లేచి ఎగిరే భావదృశ్యం ఈ స్వప్నం. ఇంతకుముందు నేత్రం చూచింది కావచ్చు. మనస్సు అనుభవించింది కావచ్చు. దాని స్మృతి రూపం ఎన్నో రూపాల్లో విప్పుతుంది.

ఇది స్త్రీ భావనాకేంద్రంగా సాగుతుంది. ఈ స్థితి ఒక్కొక్కపుడు మెలకువలోనూ జరుగుతూ ఉంటుంది పూర్తిగా నిద్రకాదు. మెలకువ కాదు. నిద్రా సమమైన స్థితి. ఈ సాధారణ లౌకిక జగత్తును మరచిన స్థితిలోనే ఇది సాధ్యం. ఈ స్థితిలో ఉద్భవించే కొన్ని రూపాలు! ఆకా భాషణంగానో, స్వగతంగానో, కవిత్వంలో వెలువడుతూం టాయి. సౌందర్య భావనతో ప్రతీకాత్మకమైన కళారూపమే "మహాస్వప్నం".

ఇది వైయుక్తికమైన సౌందర్యానుభవరూపం అక్షరాకృతితో సాధారణీకృతమై సామాజికమవుతూంది. క్రమంగా ఇది వ్యక్తి పరిధిని దాటి సామాజిక విస్తృతిని పొంది, విశ్వజనీనమూ అవుతూంది.

సుమనశ్రీ "మహాస్వప్నం" కావ్యం తెలుగు కవితా ప్రపంచంలో అపూర్వమైంది. మనస్తత్వపరంగా అట్లా ఉంచి. సౌందర్య కళాత్మకమైన భావపరంపరతో అనుభూతి గుణాన్ని భావింపజేస్తూంది. మనస్సు పొరల్లో నుండి అందమైన సరస్సులో నీటిపై తేలే పద్మం వలె ఆకర్షిస్తుంది. ఇది పైన స్పృశించే కిరణాలకు విచ్చుకుంటుంది. అందాల్ని ప్రకటిస్తుంది. ఆమోదాన్ని ప్రసరిస్తుంది. అన్నిటికంటె జీవిత తత్త్వాన్ని భావింపజేస్తుంది. ఈ నేత్రం అసాధారణమైన వస్తు ప్రపంచాన్ని సమీపానికి తెస్తుంది. దర్శింప జేస్తుంది చెదరి పోతున్న మనసులో నుండి కరగిపోతూన్న మనిషిలో నుండి, నిశ్శబ్దంలోకి ప్రవహింపజేసే స్వప్న పరిమళరూపం ఈ కావ్యం.

ప్రొఫెసర్, క్వార్టర్ నెం. 14, విద్యారణ్యపురి, కాకతీయ యూనివర్సిటీ, వరంగల్ - 506 009.

## హిందీ ప్రచారక్ ప్రశిక్షణ మహావిద్యాలయం, గుంతకల్లు

# ఉపాధ్యాయ దినోత్సవము

ది. 5.9.96న హిందీ ప్రచారక్ మహా విద్యాలయం గుంతకల్లులో ఉపాధ్యాయ దినోత్సవము జరిగినది. కుమారి జరీనాబీబి స్వాగతోపన్యాసము తదుపరి కుమారి యస్. షకీల మరియు కుమారి పి. వరలక్ష్మి ప్రార్ధనా గీతాన్ని ఆలపించిన తరువాత సభ ప్రారంభమైనది. కుమారి ఎ.బి. మాధవి పరిచయ వాక్యాలను పల్కినది. ఆచార్యులు శ్రీ కె. గంగిరెడ్డిగారు అధ్యక్షతను వహించారు. నాడు రిటైర్డ్ హిందీ ఆఫీసర్ శ్రీ జి. నరసింహప్పగారు ముఖ్య అతిథులుగా వ్యవహరించిరి. సభ ప్రారంభములో ప్రచారక్ విద్యాలయ విద్యార్థులు గురువులను పూలమాలలతో మరియు దుశ్శాలువలతో సత్కరించిరి. తరువాత విద్యాలయ ప్రధానాచార్యులు శ్రీ కె.వి. సుబ్బారావు గారు ముఖ్య అతిథులైన శ్రీ జి. నరసింహప్పగారిని పూలమాలలతో మరియు దుశ్శాలువతో సన్మానించిరి. ప్రచారక్ విద్యాలయ ప్రధానాచార్యులైన శ్రీ కె.వి. సుబ్బారావు ఆచార్యులు శ్రీ కె. గంగిరెడ్డి మరియు శ్రీ సి. జయశంకర్ బాబులను విద్యార్థులు సన్మానించిరి.

ముఖ్య అతిథులు శ్రీ జి. నరసింహప్ప "సమాజ ప్రగతిలో అధ్యాపకుల పాత్ర" గురించి ఉపన్యసించిరి. తదనంతరము యు. కామేశ్వరి, టి. సుబ్బలక్ష్మి, జగన్‌మోహన్ రెడ్డి, రఫి, ఇక్బాల్ షరీఫ్, యస్. షకీల, ఎమ్. భవానీ మరియు బి. నాగలక్ష్మి అధ్యాపకుల గురించి మరియు అధ్యాపక దినోత్సవము గురించి తమ అభిప్రాయాలను వెల్లడించారు. ప్రధానాచార్యులు శ్రీ కె.వి. సుబ్బారావు ఆచార్యుఉ శ్రీ కె. గంగిరెడ్డి మరియు శ్రీ సి. జయశంకర్‌బాబు లు కూడా ఉపన్యసించిరి. చివరిగా ఎ.బి. మాధవి ధన్యవాద సమర్పణతో సభ ముగిసినది. తరువాత సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినవి.

# పొందూరు

## హిందీ దినోత్సవము

తే. 14-9-96 ది ఉదయం 8 గంటలకు మండల కేంద్రమైన పొందూరులో 2వ నెంబరు పాఠశాలలో M.R.O. శ్రీ కె. బలరాం మూర్తిగారి అధ్యక్షతన హిందీ అభిమానులు, హిందీ ప్రచారకులు, హిందీ విద్యార్థులు "ర్యాలీ" నిర్వహించిరి. తరువాత 10 గంటలకు M.R.O. శ్రీ కె. బలరాంమూర్తిగారు హిందీ భాష యొక్క విశిష్టతను హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకతను వివరించిరి. Rtd. Hindi Pandit శ్రీ వెంకటరావుగారు హిందీ దినోత్సవం యొక్క ప్రాముఖ్యతను వివరించిరి. హిందీకి గల విభిన్న రూపములను వివరించిరి. పోటీలో గెలుపొందిన విద్యార్థులకు జిల్లా యువజన సంఘం అధ్యక్షుడు కె. శాంతారాం గారు బహుమతి ప్రదానం గావించిరి.

స్థానిక విశ్వశాంతి హిందీ అధ్యయన కేంద్రం వ్యవస్థాపకులు శ్రీ K. మదుసూదన్‌రావ్, హిందీ పండితులు గన్నవరపు శ్రీనివాసరావు హిందీ బాష యొక్క అవశ్యకతను వివరించిరి. అనకుపల్లి శ్రీనివాసరావు వందన సమర్పణం చేసిరి. సభ సమాప్తమయినది.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

## విశారద స్నాతకోత్సవము మరియు అమృతోత్సవము



ది. 29-9-96న జరిగిన విశారద స్నాతకోత్సవము మరియు అమృతోత్సవము సందర్భంగా
డా॥ అక్కినేని నాగేశ్వరరావు గారిని సన్మానించుచున్న శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు



హైకోర్టు చీఫ్ జస్టిస్ శ్రీ ప్రభాశంకర్ మిశ్రా గారికి స్వాగతం చెబుతున్న దృశ్యం.